చదవండి!

# ఆంధ్రమహిళ

(స్త్రీల సచిత్ర మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయి ఎం ఏ బి ఎల్

సంపాదకురాలు శ్రీమతి చన్నాఖంటమ్మ ఎం ఏ ఎల్ టి

సర్వతోముఖమైన స్త్రీజనాభ్యుదయమే తమ ఆశయంగా తదాశయసిద్ధికోసం ఎనిమిదేళ్ళనుంచీ నిరంతరం కృషి చేస్తూన్నది ఆంధ్రమహిళ

ఆంధ్రమహిళలో ఉత్తమ కథానికలతోపాటు సాంఘిక రాజకీయ సారస్వత వైజ్ఞానిక మున్నగు వివిధ రంగాలకు సంబంధించిన వ్యాసాలు విశేషంగా ప్రచురింపబడుతవి

ఆంధ్రమహిళ ప్రతి జన్మదినసంచికా ఎక్కువ పేజీలతో మనోజ్ఞంగా అలంకరింపబడుతుంది

రచయితలు అభిమానులు ఎప్పటికప్పుడు సహకరిస్తూండాలని కోరుతున్నాం

విడిప్రతి వెల 0-8-0 సం॥ చందా రూ 6-0-0

(చందాదారులకు ప్రత్యేకసంచిక ఉచితం)

ఇతర వివరాలకు మేనేజర్ ఆంధ్రమహిళ,

11 స్పాంకు మైలాపూరు – మద్రాసు 4

## ప్యాకింగ్ కేసులు

మీకు కావలసిన సైజులలో

ప్యాకింగ్ కేసులను

మేము తయారుచేసి

ఇవ్వగలము

**జోస్ ఇండస్ట్రియల్స్,**

**ఒల్లూర్ (కొచ్చిన్ స్టేట్)**

# కిన్నెర

సెప్టెంబరు 1953

## విషయసూచిక





ఎడిటర్ పందిరి మల్లికార్జునరావు

అసిస్టెంట్ ఎడిటర్ పందిరి మీరాబాయి

సంపుటము 5 | సెప్టెంబరు 1953 | సంచిక 9


# ఆంధ్ర ప్రభుత్వ చిహ్నం

అక్టోబరు ఒకటవ తేదికి ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడ గలదు. ఆంధ్రదేశ చరిత్రలో ఆ రోజు చరిత్రాత్మకమైనది. నలభై సంవత్సరాల అవిరళ ప్రయత్నం ఫలితంగా మనకు ఈనాడు ప్రత్యేకరాష్ట్రం లభిస్తున్నది. ప్రత్యేక రాష్ట్ర నిర్మాణంవల్ల ఆంధ్రదేశపు రాజకీయ ఆర్థికాభివృద్ధికి దోహదం కాగలిగేటట్లు మన సహాయసంపదనంతా వినియోగపరచుకోవాలి.

ఆర్థిక రాజకీయ పురోవృద్ధితోబాటు సంస్కృతి రంగంలోకూడ పురోగమించవలసి ఉంటుంది. విద్యా ప్రచారం, జ్ఞానప్రసారం, సారస్వతాభివృద్ధికి ఎంతో కృషి చేయవలసిఉంటుంది. ఈ రంగాలలో పురోగమించిననాడే సంస్కృతిక్షేత్రంలో యథోచిత ప్రగతికి అవకాశం ఏర్పడ గలదు. కాబట్టి ఆంధ్రప్రభుత్వం ఏర్పడినవెమ్మట ఆయా రంగాలలో జరుగవలసిన పని యథాక్రమంగా కొనసాగేటట్లు చూడవలసిన బాధ్యత ఆంధ్రప్రభుత్వం, ఆంధ్రప్రజపై విశేషంగా ఉంటుంది.

సాంస్కృతికంగా జాతి పురోగమించిననాడే జాతి జీవంతో మనగలదు. జాతి మనుగడకు ఆర్థికసంపద ఎంత ముఖ్యమో, సంస్కృతికూడ అంత ముఖ్యమే; అంతకంటె ముఖ్యమనికూడ చెప్పవలసిఉంటుంది. జాతికి సంస్కృతి జీవగర్ర కాబట్టి, ఆంధ్ర రాష్ట్రావతరణతోబాటు సంస్కృతి రంగంలో జరుగవలసిన పనులనుగూర్చి విజ్ఞులు ఆలోచింపవలెను. ప్రభుత్వం ఇందుకు తోడ్పడాలి.

ఇందుకు ఉత్తేజాన్ని, స్ఫూర్తిని కలుగచేసేటట్లు మన ఆంధ్రప్రభుత్వ చిహ్నం ఏర్పడడం సర్వథా వాంఛనీయం. ఈ విషయంలో రెండు అభిప్రాయాలు ఉండజాలవు. భారత ప్రభుత్వం అశోక చిహ్నాన్ని ప్రభుత్వ చిహ్నంగా స్వీకరించింది. మద్రాసు ప్రభుత్వం దేవాలయ గోపురాన్ని తన గుర్తుగా అంగీకరించింది. ఆంధ్ర ప్రభుత్వానికికూడ ఒక చిహ్నాన్ని ఏర్పరచుకోవాలి. అది ఎట్లాంటి చిహ్నం? సంస్కృతి జాతి మనుగడకు ఒక ప్రధానమైన ఆధారం కాబట్టి, అట్టి చిహ్నం సాంస్కృతికంగా ఉండడం ఎంతేని

అవసరం ఆంధ్రజాతి కళావైభవాన్ని స్ఫురణకుతెచ్చేటటు వంటిదిన్నీ, ఆంధ్రుల చరిత్రగౌరవాన్ని ప్రదర్శించేటటు వంటిదిన్నీ, ఆంధ్రుల కీర్తిప్రతిష్ఠలకు అనుగుణమైనట్టిదిన్నీ అయిన చిహ్నమును గ్రహించడం సమంజసమేకాదు, కర్తవ్యంకూడాను అట్లాంటి లక్షణాలు అమరావతీ స్తూప చిహ్నానికి అమరిఉన్నవి కాబట్టి, ఏర్పడనున్న ఆంధ్ర ప్రభుత్వం అమరావతీ స్తూపాన్ని ప్రభుత్వ చిహ్నంగా గ్రహించవలెనని మా సూచన

స్తూపనిర్మాణంతో ప్రారంభమైనది భారత శిల్పకళా జీవనం వాస్తు, మూర్తి శిల్పకళలకు స్తూపమే ప్రాతిపదిక అని భావించడం చారిత్రక సత్యం కాకపోదు స్తూపనిర్మాణంతో ప్రారంభమైన కళాజీవితం అద్భుత శిల్పకళాఖండాల సృష్టితో పరిపాకాన్ని పొందింది కాబట్టి, స్తూపం భారత జాతి కళాజీవిత ప్రారంభకాలాన్ని ద్యోతకపరుస్తుంది భారత శిల్పులు స్తూపనిర్మాణంతో ఓనమాలు దిద్దారు తదాధారంగా భారతీయ శిల్పులు తమ కళావైదగ్ధ్యాన్ని పెంపొందించుకొని, తమకేకాదు జాతికంతకు కీర్తిగౌరవాలను లభింపజేశారు

ఆంధ్రదేశంలో బౌద్ధయుగంలో శిల్పకళావైభవం మిన్నుముట్టినది ఆకాలమున ఆంధ్ర శిల్పకళకు దీటు వచ్చునది మరియెక్కడను హిందూదేశంలో కనబడదని కళా విమర్శకు లందరికిని తెలిసినదే అమరావతి, నాగార్జున కొండయందున్న చైత్యస్తూపరాజములు బౌద్ధాంధ్రయుగ శిల్పకళా విధానాలు నాటికే ఆంధ్రుల శిల్పకళావైదగ్ధ్యం పరాకాష్ఠ నందజాలినది ఆంధ్రజాతి కళాభివివేశానికీ, కళావైదగ్ధ్యానికీ చిహ్నంగా నేటికీ నిలచిఉన్న అమరావతీ స్తూపాన్ని ఆంధ్ర ప్రభుత్వ చిహ్నంగా గ్రహించడం ఆంధ్ర జాతి చరిత్రకు, అతిశయానికీ అనుగుణంగా ఉండగలదు కాబట్టి, అమరావతీ స్తూపచిహ్నాన్ని యథాతథంగాగాని, తదాధారంగాగాని ఆంధ్రప్రభుత్వ చిహ్నంగా ఏర్పరుచుకోవడం భావ్యమని మా సూచన ఆంధ్రదేశంలోని సారస్వత సంస్థలూ, సంస్కృతిరంగ కార్యకర్తలూ, విద్యాసంస్థలూ, గ్రంథాలయాది జ్ఞానప్రసారక సంస్థలూకూడ మేము చేసిన సూచనతో ఏకీభవిస్తూ, ఏతద్విషయమై అభిప్రాయాలను ప్రకటించవలసినదిగా మా ప్రార్థన

# వ్యా ఖ్యా లు

మహాగోదావరి ప్రకోపం

కనీ, వినీ ఎరుగనంతటి మహోద్ధృతంగా గోదావరి నది కట్లుత్రెంచుకొని, వెల్లువలై పారింది రాజమహేంద్రవరంలో ఆర్యాపురం, సీతంపేట, తుమ్మలావ, ఇన్నీసుపేట, ఆల్కాట్ తోట మొదలైన ప్రదేశాలన్నీ జలమయమైపోయినాయి అట్లాగే ఉభయగోదావరి జిల్లాలలోని పలు గ్రామాలు జలార్ణవమయినాయి

ప్రజలు తమ ప్రాణాలు దక్కించుకోడానికి సర్వస్వం వీడి, కట్టుగుడ్డలతో ఇళ్లు, వాకిళ్లు వదలి రావలసి వచ్చింది ఇంటనున్న ఆస్తిపాస్తులు గోదావరి గర్భాన్ని చేరాయి పశువులు నీట కొట్టుకొనిపోయాయి పంటలు పూర్తిగా నాశనం కావడమేకాక, చేలు అన్నీ ఇసుకపర్ర లయిపోయినాయి మరల సాగుచేయడానికి ఎప్పటికి వీలవునో ఎవరి కెరుక ?

ఆంధ్రదేశ చరిత్రలో ఇంత ఉపద్రవం ఎన్నడూ సంభవింపలేదు రాష్ట్రావతరణ సందర్భంలో ఇటువంటి ఘోరవిపత్తు సంభవించడం మరీ శోచనీయం ఆంధ్రదేశానికి ధాన్యాగారాలైన ఉభయ గోదావరి జిల్లాలు గోదావరి ప్రకోపానికి ఆహుతికావడం నూతనరాష్ట్రపు ఆర్థిక సౌష్ఠవానికి పెద్ద దెబ్బ

నిన్న మొన్నటిదాకా ఆలుబిడ్డలతో హాయిగా జీవిస్తున్న రైతు తెల్లవారేసరికి నిరుపేద అయిపోయాడు తిన

దానికి తిండిలేదు నిలవడానికి ఇల్లులేదు జలమయమైన ప్రాంతాలవారి హాహాకారం హృదయవిదారకంగా ఉన్నది ఇటువంటి పరిస్థితిలో ప్రభుత్వం, ప్రజా ఆదుకోవలసి ఉంటుంది సత్వర సహాయానికి పూనుకోవలసి ఉంటుంది తిండీ, బట్టా, మందూమాకూ వెంటనే సరఫరాచేసి తగిన బందోబస్తు చేయాలి

దేశంలో ఏమూలనైనా ఏవిధమైన ఆపద వాటిల్లి నప్పటికీ తెలుగు హృదయం ద్రవించి, తెలుగు ప్రజలు సహాయ కార్యక్రమాలకు ముందంజ వేసేవారు బీహారు భూకంపం కానీయండి, క్వెట్టా భూకంపం కానీయండి యథాశక్తి తోడ్పడింది తెలుగుదేశం తెలుగుచేయి ఇంతవరకు పైనున్నదే కాని, క్రిందుగా ఏనాడూ లేదు కాని, విపత్కర పరిస్థితివల్ల నేడు తెలుగుజాతి చేయి చాపవలసివచ్చింది

ఇట్టి విపత్కర పరిస్థితిలో రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు విరివిగా సహాయం చేయవలసిఉన్నది ఉభయ గోదావరి జిల్లాలలోను పునరావాసమునకు పథకాలువేసి, తగిన సౌకర్యాలు, ఏర్పాట్లు చేయడానికి కోట్లమీద ఆర్థికసహాయం కావలసిఉంటుంది కాబట్టి, కేంద్రప్రభుత్వంకూడ కొంత సొమ్మును మంజూరుచేసి, ఇందులకై కేటాయించవలెను

ఈ సందర్భంలో ఒక విషయాన్ని ప్రస్తావించకుండ ఉండజాలము ఈనాడు ఉభయ గోదావరులకు కలిగిన విపత్తుదృష్ట్యా గోదావరి వరదలనుంచి ప్రమాదం కలుగకుండునట్లు చూడవలసిన భారం ప్రభుత్వంమీద ఉన్నది వృథాగా సముద్రంపాలుకావడమేకాక, గ్రామాలమీదికి వరదలై పారుతున్న దావరీ జలాల సద్వినియోగానికి ప్రణాళికలనుకూడ యోచించవలసిఉన్నది

ప్రభుత్వం, ప్రజా ఈ విపత్సమయంలో ఉభయ గోదావరి జిల్లాలకు తోడ్పడి, విపన్నివారణకు పూనుకోవాలి

## అరబ్బీ మహాభారతం

భారత దేశానికి స్వాతంత్ర్యం లభించిన పిమ్మట కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంస్కృతి రంగాలలోకూడ కుతూహలం చూపి, పనిచేయుచుండడం మనం చూస్తున్న విషయమే నిరక్షరాస్యత ప్రబలి, సారస్వత వికాసానికి అవరోధం కలిగించే పరిస్థితి పరివర్తనం చెందేవరకు సంస్కృతి వికాసానికి సంపూర్ణావకాశం చేకూరదు కాబట్టి, ప్రభుత్వం ఈ కార్యక్రమాలకు దోహదం కలిగించే పూనిక వహించడం ముదావహమే

మద్రాసు ప్రభుత్వంచే నియుక్తమైన ఆస్థానకవుల పదవికి స్వస్తివచనాలు పలికారు ప్రాంతీయభాషలు నాలుగూ, సంస్కృతం ఒకటీ—ఈ అయిదింటికీ అయిదుగురు ఆస్థానకవులు ఏర్పడడం, వారికి సంవత్సరానికి వేయి రూపాయలు ఇవ్వడం—అంటే నెలకు ఎనభై రూపాయల పైచిలుకు (గుమాస్తా జీతంకంటె తక్కువ) ఇవ్వడం భారమై తోచిందో, లేక అనవసరమనే తోచిందో ఏమైతేనేమి—ఆస్థానకవుల పదవులు రద్దుచేయబడినాయి

ఇక కేంద్రప్రభుత్వం సంస్కృతిరంగంలో పనిచేయ సంకల్పించింది కాబట్టి, రచయితలకు పారితోషికాలు ఇవ్వడానికి నిశ్చయించింది కావుననే, కేంద్ర విద్యాశాఖామాత్యులైన మౌలానా ఆజాద్‌గారు ఏ దేశంలోనో ఒకానొక కవి మహాభారతాన్ని అరబ్బీ భాషలోనికి అనువదించినందుకు ఎనభై వేల రూపాయలను కేంద్రం ఖజానానుంచి ముట్టజెప్పి, ఆ పుస్తకం కాపీరైటును సంపాదించారు బహుశా వ్రాతప్రతిని ఏ మ్యూజియంలోనైనా ఉంచెదరేమో ; లేక మరికొన్ని వేలో, లక్షలో ఖర్చుపెట్టి ఈ అరబ్బీ గ్రంథాన్ని అచ్చువేయించి, భారత ప్రజలకు అందజేయనూవచ్చు

దేశభాషలలోని ఎన్నో ముఖ్యమైన గ్రంథాలు పునర్ముద్రణలేక పడిఉన్నాయి ఎన్నో గ్రంథాలు అచ్చుకాక వ్రాతప్రతులుగానే ఉండిపోయినాయి ఇట్లాంటి గ్రంథాలు అచ్చుకాలేని పరిస్థితిలోఉంటే విద్యాశాఖామాత్యులగు శ్రీ ఆజాద్‌గారికి అరబ్బీ మహాభారతం అత్యవసరమని తోచింది అయితే—మహాభారతం రష్యన్ భాషలోకికూడ అనువదింపబడినదే ; అరబ్బీ మహాభారత అనువాదకర్తకు ఇచ్చినట్లే, రష్యన్ అనువాదకర్తకుకూడ పారితోషికం ఇస్తారా ?

1950 సంవత్సరం జనవరినెల దాకాకు ఏన్షంట్ ఇండియా (Ancient India) అనే పురాతత్వశాఖ బులిటెన్ నేటివరకు ప్రజలకు అందుబాటుకాలేదు కేంద్రప్రభుత్వం



కీ స్లై ర

దీని ధరను నిర్ణయిస్తేనేగాని ప్రజలకు విక్రయింపబడే అవకాశంలేదు కేంద్రప్రభుత్వానికి ఇంతవరకు తీరుబడి కాలేదో, లేక ధర నిర్ణయం జరగడానికి ప్రభుత్వదృష్టి ఆకర్షింపబడలేదోకాని, లెబనాన్ దేశంలో అనువదింపబడిన అరబ్బీ మహాభారతం ప్రభుత్వదృష్టిని ఆకర్షించడం విచిత్రమే

ప్రభుత్వం ఇకనైనా ప్రజోపయోగకరములైనవి– అంటే భారత ప్రజలకు ఉపయోగకరమైనవాటికి డబ్బు ఖర్చుపెడుతూ ఉండడం మేలు

శ్రీ ప్రతాప రెడ్డిగారు

శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారు 25 ఆగస్టు మంగళవారం రాత్రి అలంపురంలో అకస్మాత్తుగ హృదయచలనం ఆగిపోయి అసువులు బాసినారనే వార్త యావదాంధ్ర లోకాన్ని తీవ్రసంతాపంలో ముంచింది శ్రీ ప్రతాప రెడ్డిగారు సారస్వత రంగంలోనేకాక సాంఘిక, రాజకీయ రంగాలలోకూడ విశేషంగా పాల్గొనినారు న్యాయవాదులుగా వృత్తిని ప్రారంభించినప్పటికీ సారస్వతసేవా, ప్రజాసేవయే ప్రధానవృత్తులయినాయి శ్రీ రెడ్డిగారికి

1924 సంవత్సరంలో గోల్కొండ పత్రికను స్థాపించారు 1949 వరకు ఆ పత్రికకు సంపాదకులుగా ఉండి నిర్వహించారు హైదరాబాదు రాజ్యంలోని ఆంధ్రోద్యమంలో వీరు నిర్వహించిన పాత్ర ప్రధానమైనదని చెప్పవలసిఉంటుంది ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులుగ వీరు చేసిన సేవ ఉగ్గడింపతగినది హైదరాబాదు శాసనసభకు వనపర్తి నియోజకవర్గంనుంచి ఎన్నికఅయి, ప్రజల బాగోగులకు పేర్కొనతగిన సేవచేస్తున్నవారిలో శ్రీ రెడ్డిగారు ఒకరు

"ఆంధ్రుల సాంఘిక చరిత్ర", "హిందువుల పండుగలు" మొదలైన అనేక ఉపయుక్తగ్రంథాలు రచించారు ఆంధ్రుల సాంఘిక జీవితాన్ని తెలియపరచే ఉద్గ్రంథాన్ని రచించి, తెలుగు సరస్వతికి ఒక వినూత్నాలంకారాన్ని చేకూర్చారు

శ్రీ ప్రతాప రెడ్డిగారు రచయిత, వక్త, రాజకీయవేత్త, సారస్వత సేవకులు వీరు అనేక రంగాలలో ఆరుగిడి, హైదరాబాదురాజ్య ప్రజలకూ, తెలుగుదేశానికీ చేసిన సేవ అపారమైనది తెలుగు లిపి సంస్కరణ విషయమై కూడ వీరు చాల పరిశ్రమచేశారు

తెలుగు భాషాసమితి ఆధ్వర్యాన జరుగుతున్న సభలలో శ్రీ రెడ్డిగారు ఒక ఉపన్యాసాన్ని ఇచ్చుటకు అంగీకరించారు వరు ప్రత్యేకి కృషిచేసిన "ఆంధ్రుల సాంఘిక చరిత్ర పై ఉపన్యసించుటకు భాషాసమితి ఆహ్వానాన్ని అంగీకరించి, ఉపన్యసించుటకు ఆమోదించినారు కొన్ని అవాంతరాలచే వారు మద్రాసు వచ్చి ఉపన్యసించుట కాజాలకపోయినది వారు మద్రాసు రాబోవు సందర్భంలోనే "లిపి సంస్కరణ" ను గూర్చి ఒక మహాసభను (symposium) కూడ ఏర్పరచడానికి సంకల్పించాము కాని, ఇవి జరుగకముందే శ్రీ రెడ్డిగారు దివంగతులయినారు

విశాలాంధ్రోద్యమాన్నిగూర్చికూడ వీరు విశేషంగా పరిశ్రమించారు నూతన ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భంలో వీరు దివంగతులగుట ఆంధ్రుల దురదృష్టం

శ్రీ ప్రతాప రెడ్డిగారు సౌజన్యమూర్తులు శాంతస్వభావులు నిరాడంబర జీవులు ప్రకటనకోరని సేవావ్రతులు అమృత హృదయులు

దుఃఖసాగరంలో మునిగిఉన్న వారి కుటుంబానికి మా సానుభూతి



# దుష్యంత ఉదంతం

బుద్ధవరపు కామరాజు, బి యస్ సి, ఎల్ ఎల్ బి

యయాతి కుమారుడైన పూరుడు రాజాధిరాజై వంశకర్త అయాడు అతనికిన్నీ అతని భార్య కౌసల్య అనేదానికిన్నీ జనమేజయు డనేవాడు పుట్టాడు అతడు మూడు అశ్వమేధ యాగాలు చేశాడు ఈవిధంగా పూరుని వంశంవారు రాజ్యం చేస్తూవచ్చారు ఇలిలుడు అనే రాజుకున్నూ అతని భార్య రథంతరి అనే ఆమెకున్నూ దుష్యంతుడు పుట్టినాడు దుష్యంతుడు బాల్యంనుండీ అపారమైన ధైర్యసాహసాలు కలవాడు చిన్నప్పుడే పులులనూ సింహాలనూ లేడిపిల్లలను పట్టుకొన్నట్లుగా పట్టుకొని ఆడించేవాడు కూకటివేళ్ళతో సహా చెట్లను పెకలించ శక్తిగలవాడు

అట్టి దుష్యంత మహారాజు ఒకనాడు వేటకు అడవికి పోయి వేటాడి వేటాడి గంగాతీరానవున్న ఒకానొక రమణీయమైన ఉద్యానవనం చేరాడు ఆ వనంలో చిలుకలు సామవేదం పారాయణచేస్తున్నవి ఏనుగులు వింటున్నవి దగ్గరలో చెట్లపొదలలో సింహాలు విశ్రమించినవి ఎలుకలు పిల్లులు కలిసిమెలిసి ఆడుకుంటూ ఆహారం తింటున్నవి దుష్యంతుడు అత్యంతాశ్చర్యపడి, అది కణ్వమహాముని ఆశ్రమానికి చెందిన వనమని గ్రహించాడు

‘కణ్వమహాముని దర్శనంచేసుకొని, ఆశీర్వాదంపొంది వస్తాను మీరంతా ఇక్కడే ఉండండి” అని తన అనుచరవర్గంతో చెప్పి తానొక్కడూ ముని ఆశ్రమం చేరినాడు అక్కడ అందాలబరిణె అయిన శకుంతల అనే కన్యక అగుపడిం దాతనికి ఆ మహారాజు దుష్యంతుడని వినికిడివుండి పోల్చిన దామె సగౌరవంగా ఆహ్వానించి కుశలప్రశ్నలు వేసినది

“వేటాడుతూ కణ్వమహాముని దర్శనం చేసుకుందామని ఇలా వచ్చాను వారు ఎక్కడికి వెళ్ళారు ?” దుష్యంతుడు అడిగినాడు

“ఫలాలు తీసుకురావడానికి వెళ్లారు మీరు వచ్చారని తెలిస్తే ఇప్పుడే వచ్చేస్తారు” అన్న దామె ఆమె మాటలు అతి తీపిగా ఉన్నాయాతనికి ఆమెను చూస్తున్న కొలదీ ఆతని హృదయం ఎక్కువగా దడదడలాడింది

“నువ్వెవరి అమ్మాయివి ? ఇక్కడెందు కున్నావు ?”

“కణ్వమహాముని కూతుర్ని ”

దుష్యంతుడు ఆలోచనలో పడినాడు ; ఈ అమ్మాయి నిజంగా కణ్వమహాముని కూతురే అయితే తనకు ఆమెపై ఎందుకింత అనురాగం కలుగుతుంది ? కణ్వుడికి భార్యలేదే ; ఆయనకు కుమార్తె ఎక్కడిదీ ; ఇదేమీ నమ్మతగ్గదిగా కనబడటంలేదు తనకు ఇందులో ఏదో రహస్యం ఉంది తాను నిజ మేమిటో తెలుసుకోవాలి

“కణ్వమహాముని బ్రహ్మచారి ఆయనకు నువ్వు కూతుర వెట్లా అయావు ? నిజం చెప్పు ” దుష్యంతుడు అడిగినాడు

“మీలాగే ఒక మునికూడా సందేహం కలిగి మా నాన్నని అడిగాడు అప్పుడు మా నాన్న నా సంగతంతా ఆయనతో చెప్తూంటే నేను విన్నాను. ఆ కథ ఇది ; “విశ్వామిత్రు డనే రాజర్షి ఘోరతపస్సు చేస్తూన్నాడు ఆ తపస్సు భంగం చెయ్యాలని దేవేంద్రుడు మేనక అనేదానిని నియమించి విశ్వామిత్రునివద్దకు పంపించాడు మేనక ఫలాలు పుష్పాలు తెచ్చిఇచ్చేనెపంతో విశ్వామిత్రునివద్ద ఉంటూంది కొన్నాళ్ళకు ఆమె ఆకారం అతనిని పూర్తిగా ఆకర్షించింది విశ్వామిత్రుడు కామానికి లొంగిపోయాడు ఆమె వలలో చిక్కుకొన్నాడు కొన్నాళ్ళకు వారిద్దఱకు ఒక అమ్మాయి పుట్టినది ఆ శిశువును మాలిని అనే ఏటి ఒడ్డున వదలిపెట్టి మేనక దేవలోకానికి వెళ్లిపోయింది విశ్వామిత్రుడు మళ్ళీ తపస్సు ప్రారంభించాడు మృగాలపాల బడకుండా శకుంతపక్షులు ఆ శిశువును తమ రెక్కలతో కప్పి కాపాడుతున్నాయి సమిధలు పువ్వులు ఫలాలు తెచ్చుకొనేందుకు నేనూ నా శిష్యులూ మాలినీ నదిఒడ్డుకు వెళ్లడం తటస్థించింది అప్పుడు శకుంత పక్షుల రక్షణలో వెన్నెలలా ఉన్న ఆ శిశువును చూచాను ఎత్తుకొనివచ్చి పెంచాను శకుంత పక్షుల రక్షణలో ఉన్నందున ఆ శిశువుకు శకుంతల అని నామకరణం చేశాను ఆ శకుంతలయే ఈ శకుంతల జనకుడు అన్నప్రదాత భయమును పోగొట్టి రక్షించినవాడు ఈ ముగ్గురూ స్త్రీకి గురువులు వీరుగాక ఉపనయనం చేసినవాడు, విద్య గఱపినవాడు మొత్తము అయిదుగురు పురుషుడికి గురువులు ఆమెను భయమునుండి కాపాడినందున నేనామెకు గురువును ఆమెను పెంచి పెద్దచేసినందున నేనామెకు తండ్రిని, ఆమె నా మారిపెంపు కూతురు ” ఈలాగని మా నాన్న ఆ మునితో చెప్పారు ” అన్న దామె, దుష్యంతుడితో



కి స్నై క

దుష్యంతుడు విస్తుపోతూ విన్నాడు ఆనందం కలిగిం దాతనికి ఆమె మునికన్య ఏమోనని ఎంతో విన్నగ్రహపడ్డాడు కాదు ఆమె మునికన్యకాదు. రాజపుత్రి అని తెలిసాక తనకు బ్రహ్మానందంగా ఉంది తానామెను నిర్భయంగా ప్రేమించవచ్చు

"ఈ నారచీరెలు ఈ అడవిపండ్ల భోజనం, ఈ చిన్న ఆకులకుటీరం నీబోటి అందకత్తెలకు సరిపడవు నువ్వు ఈ మునిపల్లెలో నివసించడం ఎందుకు? చక్కగా నాకు భార్యవై నా అశేషరాజ్యసంపదలు, వైభోగాలు అనుభవిస్తూ నా రమ్యహర్మ్యాల్లో ఉండతగినదానివి నువ్వు బ్రాహ్మము, దైవము ఆర్షము ప్రాజాపత్యము రాక్షసము, ఆసురము, గాంధర్వము పైశాచికము అని ఎనిమిదిరకాల వివాహాల పద్ధతులున్నాయి అందులో సుక్షత్రియవంశాల వారు గాంధర్వపద్ధతినీ రాక్షసపద్ధతినీ పెళ్లిళ్లు చేసుకుంటారు ఇప్పుడు మనం ఇద్దరం ఒకళ్లనొకళ్లం ప్రేమించుకొంటున్నాం మనం క్షత్రియులం కనుక మనం గాంధర్వపద్ధతిని పెళ్లిచేసుకొందాం" అన్నాడాయన

శకుంతల సిగ్గుపడింది తల వంచేసింది "మా నాన్న చాలా మంచివాడు ఈ పద్ధతులు ధర్మాలు ఆయనకు తెలుసు ఆయన వచ్చేవేళ అయింది కూడాను ఆయన వచ్చాక నన్ను మీకు ఇచ్చి పెళ్లిచేస్తానంటే అలాగే చేసుకోవచ్చు" అన్నదామె, తల వంచుకునే

"గాంధర్వపద్ధతి అంటే ఏమిటో నీకు తెలియదు కాబోలు గాంధర్వ వివాహంలో తనకుతానే చట్టం, తనకుతానే గతి, తనకు తానే కర్తగా ఉండి తనను తానే ఇచ్చుకోవాలి ఇదీ సంగతి, గాంధర్వవివాహం అతిరహస్యం దానికి మంత్రాలు ఉండవు" అంటూ నచ్చచెప్పి ఒప్పించాడు శకుంతలను

"అలాగే పెళ్లిచేసుకుందాం గాని, మీరు నాకు ఒక వాగ్దానం చేయాలి మీకూ నాకూ కలగబోయే కొడుకును మీ యావత్తు రాజ్యానికి మహారాజుగా చేయాలి అలాగ చేస్తానని మాటఇస్తేనే మీకూ నాకూ వివాహమూ సమ్మత సంగమమూ అవుతాయి' అన్నదామె

శకుంతల నిర్ణయాన్ని దుష్యంతుడు తక్షణం అంగీకరించి వాగ్దానం చేసినాడు వారిద్దరికు గాంధర్వపద్ధతిని వివాహం అయింది ఆమె గర్భిణీ అయింది "నిన్ను తీసుకొని రావడానికి మంత్రుల్ని పరివారకుల్ని పంపిస్తాను నేను వెళ్లొస్తాను," అంటూ దుష్యంతుడు వెళ్లిపోయాడు

కణ్వమహాముని తన ఆశ్రమానికి తిరిగి వచ్చినాడు ఆమె కాయనను చూచేటప్పటికి భయమూ సిగ్గూ కలిగాయి సంగతంతా తెలుసుకొన్నాడు సంతోషించాడు "అమ్మా! నీ కులగోత్రాలకు, నీ సౌందర్యానికి తగిన భర్తను సంపాదించావు గర్భవతివయావు నీకు పుట్టబోయే కొడుకు దీర్ఘాయుష్మంతుడై ఐశ్వర్యం బలం కలవాడై వంశకర్త అవుతాడు" అని ఆమెను దీవించాడు

శకుంతల గర్భం ధరించాక మూడు సంవత్సరాలు నిండాయి భరతుడు అనే కుమారుని కన్నది భరతుడు అధిక బలవంతుడు సాహసవంతుడున్నూ బాల్యంలోనే అడవి ఏనుగులపై ఎక్కి తిరిగేవాడు క్రూరమృగాలను పట్టుకొని మర్దించి చంపేవాడు జంతువుల్ని మర్దించి శిక్షిస్తున్నందున సర్వదమను డని బిరుదు ఇచ్చా రాతనికి ఆశ్రమవాసులు భరతుడు సార్వభౌముడవుతారన్నా రంతాను

"తల్లీ! ఎట్టి సాధ్వికైనా పెద్దకాలం పుట్టింట్లో ఉండడం తగదు సతులకు పతుల కడ ఉండడం ధర్మం సతీ పతిజీవితం సరమావధిన్నీ కాబట్టి నువ్వూ, నీకొడుకూ నీ భర్తవద్దకు వెళ్ళండి. అని చెప్పి కణ్వుడు తన శిష్యులను తోడిచ్చి, శకుంతలనూ భరతుణ్ణీ దుష్యంతుడి వద్దకు పంపించినాడు.

దుష్యంతమహారాజు తన మంత్రులు, సామంతులు పురోహితులు ముఖ్య పౌరులతోకూడి కొలువు తీర్చియున్న సమయంలో శకుంతల భరతుడు మునిశిష్యులు చేరారక్కడకు. దుష్యంతుడు శకుంతలను చూచినాడు శకుంతలకు ఆనాడు తనతండ్రి ఆశ్రమంలో అతడు కనపర్చిన అనురాగం, ఆదరణ అనుగ్రహం కరుణ సంభ్రమము ఏమీ కనుపించడంలే దాయనలో తనను ఆయన ఎరుగడా? చాలాకాలం అయినందువల్ల ఎరిగియుండీ ఎరుగనట్లుగా ఊరుకున్నాడా? మరచిపోయాడా!? గొప్పవారికి అనేక పనులుంటుంటాయి కొద్దివారిని సులభంగా మరచిపోవచ్చు ఆనాడు ఆయన చెప్పిన మాటలన్నీ విస్మరించినట్లుగానే కనబడుతోంది పైగా అలాగ కోపంగా కొరకొరలాడుతూ చూస్తాడేమిటి? మహారాజులు నూతనవస్తుప్రియులు బుద్ధిమంతులు వారి మాటలను నమ్మరాదు మరచిపోతే జ్ఞాపకం చేయవచ్చు, ఎరుగనివాడికి అంతా తెలియపర్చవచ్చు . తెలిసిఉండీన్నీ తెలియనట్లు నటించే మోసగాడికి తెలియచేయడం బ్రహ్మదేవుడి తరంగూడాకాదు ఇలాగ పరిపరివిధాల ఆలోచనలు ఆమెను కలవరపర్చాయి "వచ్చి ఊరికే తిరిగిపోవడ మెందుకు? ఈ కుమారుణ్ణి చూపించి విషయం యావత్తు జ్ఞాపకంచేసి చూద్దాం," అని నిశ్చయించింది శకుంతల

"మహారాజా! వేటనెపంమీద కణ్వాశ్రమానికి తమరు విచ్చేసినప్పుడు మీరు నాకు చేసిన వాగ్దానం ఒకమాటు జ్ఞాపకం తెచ్చుకోండి సూర్యునిలా వెలుగుతూన్న ఈ బాలుడు మీ కొడుకు వీణ్ణి యువరాజును చేయండి," అన్నదామె సూటిగా

దుష్యంతుడు విన్నాడు అంతా ఎరిగి ఉండీ ఏమీ ఎరుగనివానిలాగ "నువ్వెవరో నాకు తెలియదు ఎక్కడినుంచి వచ్చావు? ఊరికే అక్రమంగా మాట్లాడవచ్చా? ఎక్కడి నుంచి వచ్చావో అక్కడికే వెళ్లు " అన్నాడాయన

ఆమె వెలవెలబోయినది నిశ్చేష్టురాలయినది ఆమె కన్నులు ఎఱ్ఱతామర పువ్వుల్లా అయినవి బాష్పములు కార్చినవి తలవంచినది క్రీగంట రాజును చూచినది ఆమె హృదయావేదనను తనకుతానే ఉపశమింపజేసుకున్నది తీవ్రంగా ఆలోచించినది

"క్రొత్తవారికివలె నేనెరుగను, నే నెరుగను అంటారేమీటి తెలిసుండికూడాను? నా కొక్కర్తెకే తప్ప ఇంకెవరికీ తెలియదు కదా అని అబద్ధం చెబ్తావా? వేదములు పంచభూతములు ధర్మువు సంధ్యలు అంతరాత్మ యముడు సూర్యచంద్రులు పగలు రాత్రి అనే మహాపదార్థములు మానవుని పనులన్నీ చూస్తూనే ఉంటాయి మీరు నాకిచ్చిన వాగ్దానం ఇవన్నీ ఎరుగును అందుచేత ఎప్పటివలె నామీద అనురాగం చూపాలి కాని నాకు అవమానం చేయవచ్చా? గుణవతీ అనుకూలవతీ ప్రజాపన్నన గన్నదీ అయిన భార్యను అవమానింపజూచే దుర్మార్గుడికి ఇహం పరం ఉన్నాయేమో ఆలోచించండి! అనుకూలవతి అయిన భార్య గలవాడు తన వృత్తివ్యాపారాల్లో వచ్చేవన్నీ క్లేశములను ఎదుర్కొనుటలో ఓరిమిగలవాడున్నూ పుత్రసంపన్నుడున్నూ కాగలడు భార్య అంటే ఏమిటనుకున్నారు? ధర్మం అర్థం కామం సాధనకు సాధనం నిర్మలమైన నడవడి అనే గృహనీతివిద్య గఱపే గురువు వంశం నిలబెట్టే మూలకందం సద్గతికి ఆధారం గౌరవాన్నాపాదించే ఏకైక కారణం సుగుణములకు గని హృదయానందానికి పుట్టిల్లు భార్యవినా భర్తప్రియమైనది లేదు భార్యను ప్రేమతో చూచినవానికి ఎట్టి పరిస్థితుల్లో ఎన్ని ఆపదలు వచ్చినా బాధ ఉండదన్న మైగా ఇంకో విషయం భార్య భర్తకు అర్ధశరీరం అందుచేత భర్తకంటె భార్య ముందుగా చనిపోతే, ఆమె పరలోకంలో తన భర్తరాకకై నిరీక్షిస్తూఉంటుంది భార్యకంటె ముందుగా భర్త చనిపోతే భార్య తానుగూడా చనిపోయి భర్తతో వెళ్లిపోతుంది అటువంటి భార్యను అవమానించడం అధర్మం భర్త భార్యయందు ప్రవేశించి గర్భమున పుత్రుడై తానే పుడతాడు తనకనే "నఙ్గాదఙ్గాత్సంభవసి" అనునదాదిగాగల వేదవచనాల్లో జనకుడు పుత్రుడు అనే భేదంలేదు తండ్రియొక్క కళాకాంతులు కొడుకులోనూ వెలుగుతూంటాయి తన నీడ తనకు నీళ్ళలో స్పష్టంగా ఎలా కనిపిస్తుందో అలాగే తన కుమారుణ్ణి తండ్రి చూడగలుగుతాడు "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః" అని వేదవచనం ఉంది పుత్రుడు తల్లిదండ్రుల ఉభయవంశాలవారినీ ఉద్ధరిస్తాడు ఒక దీపంవల్ల మరొక దీపం పుట్టినట్లు మీ శరీరంవల్ల ఈ పుత్రుడు పుట్టాడు నేను చెపుతే విపరీతంగా ఉంటుందేమోగాని ఈ మీ పుత్రుణ్ణి మనసారా కౌగలించుకొని చల్లని సుఖం సంతోషం అనుభవించండి మీ కొడుకు వంశోద్ధారకుడై నూరు అశ్వమేధయాగాలు చేస్తాడని సరస్వతీదేవి చెప్పినది ఇటువంటి కుమారుణ్ణి నిష్కారణంగా కాదనడం న్యాయమా?

ఆనాటి సత్యవాక్కు మరువవచ్చా? మంచినీటితో నిండిన నూరు నూతులుకంటె ఒక్క చెఱువు మేలు నూరు చెఱువుల కంటె ఒక్క క్రతువు మేలు నూరు క్రతువులకంటె ఒక్క సుతుడు మేలు నూర్గురు సుతులకంటె ఒక్క సత్యవాక్యము మేలు ఒక త్రాసులో వేయి అశ్వమేధాలు ఒక వైపు ఒక్క సత్యమును రెండోవైపు ఉంచి తూస్తే సత్యమువైపే ముల్లు చూపిస్తుంది సర్వతీర్థయాత్రలు చేయడం సర్వ వేదాలు పఠించడం సత్యవాక్కుతో సమం కావు ఎల్లధర్మాల్లోకి పెద్దధర్మం సత్యం కాబట్టి సత్యం మనసులో ఉంచుకొని నాటి కణ్వాశ్రమంలో చేసిన వాగ్దానం ప్రకారం చేయండి మీ కొడుకును దయతో చూడండి ఉత్తమక్షత్రియుడైన విశ్వామిత్రునకూ పవిత్రురాలైన మేనకకూ పుట్టిన నేను అబద్ధాలు చెపుతానా? అంత దుర్మార్గురాలనా?" అని దుష్యంతునితో శకుంతల వాదించినదేగాని ఆమె కంఠశోషమాత్రం మిగిలినది

"నేనెవరికెక్కడ? నువ్వెక్కడ? నీ కొడుకెక్కడ? నిన్నెప్పుడూ చూడనైనా చూడలేదు. కుద్ధ అబద్ధాలకోరు అనిపించుకోడానికి కాకపోతే నువ్వు ఎందుకు అబద్ధాలాడడం? ఈ బాలుణ్ణి తీసుకొచ్చి నీకొడుకంటావేమిటి? ఎవరైనా నవ్విపోగలరు! ఇటువంటి లోకవిరుద్ధం పనులు నాకు కిట్టవు అయోగ్యంగా మాట్లాడక నీ యాశ్రమానికి వెళ్లు" అన్నాడా మహారాజు

"తలిదండ్రులు పుట్టినప్పుడే వదిలేశారు ఇప్పుడు భర్త వదిలేశాడు ఇక ఏమి మాట్లాడి ఏం ప్రయోజనం? నేను ఎటువంటి నోములు నోచుకున్నానో ' అనుకుంటూ కన్నీరు వెల్లువలుగా ఏడ్చింది శకుంతల ఆమె గుండె ద్రవించింది కంటినీరు ఒత్తుకొని ఇంక దేవుడుతక్క దిక్కులేద"ను కుంటూ తిరుగుప్రయాణం కాబోతూంది శకుంతల

అట్టి సమయంలో దుష్యంతుడూ సభాసదులూ యావన్మందీ విస్మయపడేటట్లుగా "ఆ బాలుడు నీకునూ శకుంతలకునూ పుట్టిన కుమారుడు శకుంతల మహాపతివ్రత నీ భార్య ఆమె సత్యమే పలికినది " అని ఒక దివ్యవాణి ఆకాశమునుండి వినిపించినది దుష్యంతుడు ఆనందపరవశుడయాడు

ఆతడు సభాసదులలో "కణ్వాశ్రమంలో నే నీమెను గాంధర్వపద్ధతిని వివాహమాడిన మాట నిజం కాని ఆ సంగతి నాకూ ఈమెకూతక్క ఇతరు లెవరికీ తెలియదు అందుచేత లోకాపవాదానికి భయపడి నాకేం తెలియదన్నాను ఇప్పుడు అందరికీ తెలిసేటట్లు ఆకాశవాణి చెప్పింది " అంటూ కొడుకుని ఎత్తుకొని ముద్దులాడినాడు శకుంతలను అతిప్రేమతో పలుకరించి గౌరవించినాడు భరతునకు తన రాజ్యం పట్టాభిషేకం చేసి దుష్యంతుడు తపోవనాలకు వెడలినాడు భరతుడు అనేక యజ్ఞయాగాలుచేసి, సత్పరిపాలనచేసి వంశకర్త అయినాడు

[కాయన భారతం, ఆదిపర్వం నాలుగో ఆశ్వాసంనుండి గ్రహించబడినది ]

కిన్నెర

# సాహిత్యము లోకవృత్త ప్రదర్శకము

స్వాతి శ్రీ

సాహిత్యము సత్త్వసంబంధమైనది సత్త్వసంజనిత భావసంపద కాకరమైనది సాహిత్యము సాహిత్యముకంటెను విస్తృత మగు పరిధి కలిగినది వాఙ్మయము వికారార్థమునను ప్రాచుర్యార్థమునకు మయట్ప్రత్యయము వచ్చును ఇచ్చట వాక్శబ్దముపై మయట్ప్రత్యయము వికారార్థమున వచ్చినది అవ్యక్తమగునది భాషాసహాయమున వ్యక్తరూపము నందినయెడల వాఙ్మయము కాగలదు వాఙ్మయము వాగ్రూపమునగాని లిఖితరూపమునగాని యుండవచ్చును సాహిత్యము సర్వమును వాఙ్మయము కాగలదు కాని వాఙ్మయమున కొంతభాగము మాత్రమే సాహిత్యమై సంభావితమగును

సాహిత్యపదమును పూర్వులనేక విధములుగా నిర్వచించిరి "సహితస్య భావః సాహిత్య" మని యొకరు "రస సహితత్వమ్ సాహిత్య"మ్మని మరొక్కరు, "రసేన సహ భావః సాహిత్య" మ్మని యింకొక్కరు భావించిరి పలువురు పలువిధములగు భావములను సాహిత్య పదార్థ నిర్ధారణ విషయమున గ్రుమ్మరించిరి సజీవమై, రససమంచితమై, హితకారకమై, లోకవృత్త ప్రదర్శకమై సందేశ సంసూచకమగు భావశ్లిష్టమగు శబ్దస్వరూపము సాహిత్యమనుట సమంజసమేమో।

సాహిత్యము బహుధా విభక్తము గద్య పద్య చంపూరూపములను గేయాదిరూపములను బొంది సాహిత్యము లోకమున వ్యాప్తిగాంచినది

పూర్వులు విశ్వశ్రేయోదాయకమగునది కావ్యమని తెల్పిరి. కాని విశ్వశ్రేయోదాయకములగున వనేకములు కలవు వైద్య శాస్త్రము విశ్వశ్రేయస్సు కొరకు ఉపయోగ్యము; కాని అది కావ్యము కాదు రమణీయార్థ ప్రతిపాదక శబ్దము కావ్యమగునని పండితరాయలు పలికినారు ఇదియు మొదటిదానివలెనే ఏకభావబోధకమే కాని సమగ్ర స్వరూప నిరూపణ సమర్థము కాదు రమణీయమగు అర్థమును బోధించు శబ్దము మాత్రము కావ్యమైనచో ప్రబంధమునకు కావ్యములతో పనిలేకపోయెడిది కేవలము రమణీయ శబ్దమే కావ్యమై సమాజమును సమ్మోహింపజేయునెడల, కొంతాకవకములకంటె కావ్యమునకు ఘనత యచ్చట అబ్బురము రమణీయార్థప్రతిపాదకము జగత్స్థితిప్రదర్శకము సందేశవాహకము నగు శబ్దము కావ్యము అట్టి కావ్యవాఙ్మయమే సాహిత్యము

కవి ద్రష్ట స్రష్ట—విమర్శకుడు ద్రష్ట ప్రదర్శకుడు కవి తాను గాంచిన విషయములను తన భావనాపటిమచే పరిశీలించి వానికి అసాధారణమగు ఒక రూప మొసగి మన ముందుంచును, కన్నవిషయమును కన్నట్లుగాక దానికి రమణీయమగు ఆభరణముల గూర్చి ఆనందదాయకము, ఆకర్షణీయము నగునట్లు లొనరించును కవి తాను గాంచిన విషయమునకే తన భావనా జగత్సాహాయ్యమున క్రొత్త రూపమును జతగూర్చును విమర్శకుడు దానిని గాంచి వస్తుతత్త్వమును ప్రదర్శించును

పై విషయములను బట్టి సాహిత్యమున లోకవృత్తముండక తీరదని తెల్లమగుచున్నది కవి తాను నివసించులోకమును కాలమును విడిచి ఎక్కడకును పోజాలడు అందువలననే సాహిత్య విమర్శన సందర్భమున కవికాలము నెరుగవలసిన అక్కరయున్నది దేశకాలముల నెరుగక చేయు విమర్శ కువిమర్శ యగును

దేశకాలముల బట్టియు కవితాకల్పనమున మార్పులుండుట సాజము తిక్కన్ననాటి పరిస్థితు లీనాడు మననాట గాన్పింపవు తిక్కన్నలోని సారస్యము ననుభవించి ఆనందింతుము కాని తిక్కన్న ననుసరించి "మక్కీకి మక్కీ"గా ఒకడిప్పుడు వ్రాసిన యెడల అతనిని లోకజ్ఞాన శూన్యుడనుట సాహసము కారాదు

ఏనాడో వ్రాసిన తిక్కన్నగాని మఱేకవిగాని నాటి జనుల మన్ననలను బొందినట్లు ఈనాడు బొందలేరు నాటి జనుల హృదయమును స్పందింపజేయ గల్గినట్టు లాకావ్య మీనాటి జనులను గావింపలేదు కావ్యము ప్రాతవడుట దానికి హేతువుకాదు కావ్యవస్తువునకును లోపమురాదు. కాని అందలి వాతావరణము కవి నివసించిన వాతావరణమునకు వలె మనకు సన్నిహితము కాదు

భారతమునందలి యుద్ధఘట్టమునే చూతము నాటి రథములు, సాణలు, వారణములు, ధనుర్బాణములు అందు వర్ణితములు కాని, ఈనాడు మనము దానినిగాంచి "ఓహో। మన పూర్వులట్లు యుద్ధ

ములు గావించిరి కాబోలు" అనుకొనుచున్నాము అంతియేకాని కవి భావమును పూర్తిగా ప్రత్యక్షీకరించుకొనలేము మనయందింకను ఆ రక్తిము ప్రవహించుచుండుటవలన కొంత అనుభూతిని పొందగల్గుదుమేమో సందియము ఆదే షట్టము నొక పాశ్చాత్యుడు చదువునెడల ప్రత్యంగచ్ఛేదము చేసి పరిశీలింపగల్గునుగాని అనుభూతిని, వలసిన ఆనందమును పొందజాలడు ఆతడందు వర్ణితములగు వస్తువులకు మిక్కిలి దూరుడగుటయే కారణము

మధ్యయుగమున శృంగార కావ్యము అధికముగా తలయెత్తినది దానికి కారణము నాటి జనాభిరుచి

సారస్వతము కొందరు విశిష్టులవలన ఎప్పుడును ఆదరింపబడును సమాజము సమస్తము విద్యాసంపన్నము కానందున విద్యావంతులగు విశిష్టుల మతిప్రతిభా విశేషముల ననుసరించి సారస్వత నిర్మాణము సాగును

తొలుత నన్నయభట్టారకుడు ధర్మప్రబోధకమగు భారతాంధ్రీకరణమునకు నృపప్రేరితుడై పూనికొ వహించినాడు ఆ కాలమున జనుల ధర్మసంబంధి విషయములందు ఆసక్తి కనబరచుట దానికి హేతువు ఇక కావ్యవస్తువు అన్నదమ్ముల కలహము అచ్చటచ్చట అలౌకికవిషయ ప్రసంగమున్నను కావ్యము లోకవృత్తిప్రదర్శకము లోకములోని దాయాదులకు వలెనే తగవులాటలును యుద్ధములును అందుగలవు నాటి నృపుల కలవాటులగు జూదము, పానము, వేట మున్నగునవి కూడ వర్ణింపబడినవి అంతియేకాక నాడు ధర్మముగ వ్యవహరింపబడిన విషయముల ప్రసక్తికూడ కలదు ఇట్టులే భారతమున నాటి వాతావరణమును ప్రదర్శించు అనేక షట్టములు ద్యోతితములగును

ఇంక నన్నయభట్టారకుడు రూపించిన ద్రౌపదీపాత్రమునకును తిక్కనయజ్వ నిర్మించిన ద్రౌపదికిని మనస్తత్త్వమున భేదము గలదు కాని అది ద్రౌపదియందుగల భేదమునుగాక కవుల విభిన్న స్వరూపముల సాక్షాత్కరింపజేయును నన్నయనాటి ప్రజాదృష్టికిని తిక్కననాటి ప్రజాదృష్టికిని భేద మేర్పడినది నన్నయ ద్రౌపది కేవలం ధార్మిక తిక్కన ద్రౌపది రాజకీయధురీణ అది కవుల విభిన్న మనస్తత్త్వములకు, విభిన్న వాతావరణములకు తలయొగ్గి మార్పుచెందినది

> The monad of Poetry must reflect not only
> the individual universe of the Poet but also
> the social universe of which he is an ingredient
> —Humayun Kabir

లోకమునందు తాను పొందిన అనుభూతిని సందేశరూపమున సౌందర్యశివముగా వ్యక్తీకరించుట కవిత్వము ప్రత్యనుభూతియు వ్యక్తీకరణము నొందకపోవచ్చును ప్రతి వ్యక్తీకృతియు సందేశము కాకపోవచ్చును కాని ప్రతిసందేశమునకు వ్యక్తీకృతియు, వ్యక్తీకృతికి అనుభూతియు అవశ్యకములు కవిత్వము సందేశ సంవాహకము కాకపోయినను, కేవలోద్ఘాటనమైన కావలయును అప్పుడును అనుభూతి అవసరము హృదయమున ఏదేని విషయము గాటముగా నాటుకొన్నప్పుడుగదా—ఉద్ఘాటన మొనర్పనగును వస్తువులేనిదె ఛాయ ఏర్పడదు భావము వినా ఆకారముండదు అట్లే అనుభూతిలేని అభిభాషణ ముండదు అంతియే కాదు—

> To know an experience is to express it
> internally "—Humayun Kabir

అట్టియెడ, అనుభూతి అంతర్దర్శన మన్నమాట ; అంతరంగికముగ అవలోకించిన విషయమును బహిరుద్ఘాటించుట వ్యక్తీకరణము దీని నందరును చేయలేరు అనుభూతి నందరును పొందగల్గుదురు కాని దానిని వ్యక్తీకరించుట కొందరికి మాత్రమే సాధ్యపడును అట్టి వ్యక్తీకర్త లందరును కవులు కాజాలరు

ఆకసమున శరదభ్రమాలికల నందరును గాంతురు తన్మూలమున అందరు అన్నివిధముల అనుభూతుల నొందుదురు సామాన్యుడు వానినిగాంచి వాని తెలుపుదనమును చలువదనమును గ్రహింపగల్గునేమో ; అంతకంటెను, ఒక భావుకుడు వానిని గాంచినపుడు వానితో సాదృశ్యముగల మరేవిషయమునో తలచుకొనును వేదాంతికి మన జీవితమే జ్ఞప్తికిరావచ్చును "మన జీవితము శారద మేఘమువలె విస్వరముగదా !" అని నిస్పృహ నందవచ్చును కుమాంకవి మేఘాంచల ప్రతిఫలిత స్వర్ణవర్ణారుణకిరణ పంక్తిని గాంచి పరవశుడు కావచ్చును, ఒక భక్తుడు మేఘముల కొనలగలుగు ధౌతపర్వమునుగాంచి ధౌతనగశిఖరమున వసించు ఆదిమ దంపతుల కీర్తింపవచ్చును వస్తు వొక్కటియె కాని అనుభూతు లనేకములు అంబరము సామాన్యముగ అగపడు వస్తువు, కాని దానిమూలమున నగు అనుభూతి వివిధాంతస్సులలో లోకలోకాంతరముల లోగొన్నది

> Experience expression and communication
> are (thus) seen to be different facets of the
> same act '—Humayun Kabir

కవి తాను కాంచిన విషయమును సందేశసంయుక్తము గావించి వెలువరించును సామాన్యుడు విషయమును గాంచును ఏదో అనుభూతి నందును అంతతో సరి ఒకవేళ దానిని చెప్పనను కేవల స్వరూపమును మాత్రమే చెప్పగల్గును కవి అట్లుకాక మహత్తర విషయప్రదర్శనము గావింపగల్గును.

కె న్నె క

పై విషయములను క్రోడీకరించి, సమీక్షించినయెడల కవియే విషయమును విరిచించినను లోకవృత్తప్రమేయము లేకుండ యుండదని తేలును

' To the Poet, earth is his home
and heaven his hope "—S. Radhakrishnan

కావున, కవి తనయందు పరిసరవాతావరణము నుంచుకొని వ్యక్తిత్వప్రధానముగా కావ్యనిర్మితి గావించును నేల విడిచి సాము చేయుట సాగదు కనుక కవిత్వము భావవాసనల కోసరిల్లి మన జాలదు "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అనువారుకూడ దివినుండి భువి కెందుకు దిగిరారో చెప్పుకోవలెను భూమియందు వారికి సరిపడని సంగతులేమిటో నాకమందు వారి నాకర్షించు విషయము లేమిటో చెప్పవలయును అప్పుడును లోకవృత్త మధమము యోచితమైన కావలయును కళాఖండమునందు సూచనకును కంఠోక్తికిని భేదమంతగా కాన్పింపదు—లేదు అందువలన ఏదో యొకట్లు లోకవృత్త ప్రసక్తి రాకపోదు

"Where the mind is without fear" అను రవీంద్రుని గీతము భావసముద్భవమగు లోకమును భావించుచున్నను, ప్రస్తుతము తామున్న లోకమునుకూడ స్పృశించుటను ప్రకటించుచున్నది తాను వాంఛించు వస్తువులు ప్రస్తుతము తానున్న జగమున లబ్ధములు కావనియు అట్టివికల అన్యజగమునకు తన దేశప్రజలను గొనిపోవలయుననియు అతని యూహ

భారతదేశము పారతంత్ర్య పంకమునందు బడిమునుగుచు వెలవడజాలక వ్యసనపడు దినములందు వ్రాసిన గీత మది అది ఆనాటి పరిస్థితులను ప్రజాహృదయమును ప్రతిఫలింపజేయును

"పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కల వంగ
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగ"

అని రవీంద్రుడు కీర్తించిన భారత మఖండము కాని ఈనాడు ఖండితము నేటి ముక్కలయిన దేశమునుగాంచి రవీంద్రుడు పొరపడినాడనికాని వాస్తవిక చిత్రనిర్మితి గావింపలేదనికాని యన జాలము నాటి కది వాస్తవమే అంశువలననే శ్రీమతి రాజ్యలక్ష్మి—

"సింధురాష్ట్రింపు విప్పినసౌభాగ్య మ
లేవియా నంద్రాన లీనమయ్యె
పంజాబు గుండెపై పైశాచి కేళ్యాగ్ని
కుండమొక్కటి రగుల్కొనబడియె
నీ స్వర్ణబంగారమే స్వచ్ఛతను బాసి
రెండయ్యె గుండెలు ప్రీలిపోవ
శాంత్యభ్యుదయముల స్వాతంత్ర్య దాలన
శక్తియు మసియయ్యె సమసిపోయి
కాలవేగాన నేమో ? నీ కలము ముక్క
లయ్యె భావన నేల పాలయ్యె కథలు
కట్టుకథలయ్యె సత్యము కల్లయయ్యె
ఉర్వి శాశ్వతవస్తువే యుండరాదా "

అని విశ్వకవీంద్రుని రవీంద్రమునీంద్రుని తలపోసి వాపోవుటయు సంభవించినది కవి ప్రత్యక్షములగు తన అనుభవములను ప్రశాంతిసమయమున పర్యాలోచించి తేరిన విగ్రహము రూపించి ప్రపంచమును సందేశించును

పై నుదహరించిన విషయనంతతినిబట్టి కొంతవరకు ఒక విధమగు లోకవృత్తము సాహిత్యమున ప్రదర్శితము కావలయునని తేలినది కవిత్వమునకు అనుభూతి అవసరమనియు అట్టి అనుభూతి సామాజిక జీవితమునను లోకవ్యవహారమునను సముపలభ్యమనియు తేలినది అందువలన ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని లోకవృత్తప్రసక్తి ఉండకతప్పదని నిర్ధారించుట సాహసము కానేరదు

ఇంక కావ్యములందు స్వభావోక్తిగా ఉగ్గడింపబడునది సర్వము లోకవృత్త ప్రదర్శకము

"మాత్రసంచి తలాడగా మార్గవేది
సొక్కి డార్యలు గీతలొందొకఁడు దాసు
భాషితంబులుగాఁ దోడి బ్రాహ్మణాను
ముబుసుపోకకుఁ జదువఁ జరున్న వేళ"

—ఆముక్తమాల్యద

పై పద్యమున పరదేశియగు బ్రాహ్మణుడు వేసగికాలమందు తాను పరున్నవిధమును తెల్పినాడు ఆ యాచారము గ్రామసీమ


## ఇంగ్లీషు విద్యాబోధిని

ఒకరి సహాయ మక్కరలేకయే ఆంగ్లభాషను తేలికగ నేర్చుకొనుటకు వీలుగ వ్రాయబడినది. 30 దినములలో మంచి భాషాజ్ఞానమును నేర్వవచ్చును వెల 1-0-0

ఆధునిక కామశాస్త్రము

స్త్రీ పురుషులకు సంబంధించిన అనేక రహస్య విషయములు, పాశ్చాత్యుల పద్ధతుల ననుసరించి వివరించబడినవి. వెల 2-0-0 పోస్టుఖర్చు వేరు

ఈశ్వరి అండ్ కో
పోస్టుబాక్స్ 130 - మద్రాసు 1

అందు ఇప్పటికిని చూడనగును గ్రీష్మకాలమున, ఆరుబయట మంచములను వైచికొని నిద్రపట్టునంతవరకు లోకాభిరామాయణమో కాక పురాణాది కాలక్షేపమో కాక గీతికాగానమో—ఏదో యొకటి ఉబుసుపోకకు గావింతురు అది లోకవృత్తము కాని కేవలము ప్రబంధమున జరుగు ప్రతివిషయమును వరుసతప్పక చెప్పుట కావ్యోద్దేశముకాదు ఇచ్చట విల్లిపుత్తూరు భక్తిరసపాదోధి ఈదులాడుచుందురని తెల్పుట కవి యుద్దేశము అందుల కిదొక మార్గము సహజమగు లక్షణమునకై కాని తన్మూలమున భక్తి భావమున కాధిక్యమును ఘటించుట కవి చాతుర్యమునకు నిదర్శనము సాధారణమగు ఒక వస్తువునకై కాని కావ్యవస్తువునకు మెరుగులు దిద్దవలెను "మరొక ప్రదేశమునందైనచో పౌరులు వ్యర్థసంభాషణములతో కాలము వ్యయింపవచ్చును కాని విల్లిపుత్తూరునందలి జనులు సత్కాలక్షేపము గావింపగల నేర్పరులు భక్తినిధులు" అని తెల్పుట కవి భావము అంతియేకాని చారిత్రక సత్యములను ప్రదర్శించుట కవి మతముకాదు

ప్రతికథయందు ఇతివృత్తము లోకవృత్తమే రామాయణగాథ సాధారణముగ జరుగు చర్యయే కాని కొందరియందు అతిలోకములగు గుణములుమాత్ర మారోపితములు జననము వివాహము వనగమనము సీతాపహరణము రాక్షసహననము ప్రభృతములు రామాయణాంతర్గత ఘట్టములు తండ్రి వాక్యానుసారము రాముడు వనమున కేగుటయందు ఆదర్శపుత్రుని గుణమారోపితము అది అతిలోకము కాదు సీత రాముని వనమున కనుసరించుటయందు సహధర్మచారిణీలక్షణ మభివర్ణితము సీతయందు ఉత్కటమగు పాతివ్రత్యప్రభావమును కనబరిచి నారీలోకమునకు ఆదర్శమును ప్రదర్శించెను సీత సామాన్య స్త్రీయే కాని ఆమెయందు నారీజగత్తున కాదర్శములు కాదగిన భావములను పుంజీభవింపజేసెను సీత అగ్నిప్రవేశము భూగర్భప్రవేశమును వాస్తవమునకు దూరములు పతివ్రతామాహాత్మ్యమును పాతివ్రత్య మాహాత్మ్యమును పాఠకుల హృదయములందు స్థిరముగ పాదుకొల్పుటయే కవి ఉద్దేశించినది కవిత్వము లోకమునకు కాంతిని ప్రసాదింపవలయును సంఘమును సంస్కరించి సన్మార్గమున నడుపవలయును రావణునికి పది తలలుండుట ఇరువది బాహువులుండుట—అతని మేధాశక్తికి దైహికశక్తికి నిరూపకములగు అంశముల కాలంకారిక చిత్రణ వాస్తవికతకు విరుద్ధముగా కన్పట్టు ఆ యంశమునందు అంతర్నిహితమై యాథార్థ్యమున్నది శంబుకవధ నాటి సాంఘిక నిర్బంధములను నిరూపించును శూద్రుడు తపస్సుచేయుట నాడు నిషిద్ధము శాసనోల్లంఘన మొనర్చిన శూద్రుని శిక్షింపవలసిన బాధ్యత రాజపీఠము నధిష్ఠించిన రామునిపై నున్నది అందువలన అతనిని చంపవలసివచ్చెను. ఇది సామాన్యమగు రాజధర్మము కాని అతనిని చంపుటయందు రాము డుపయోగించిన అస్త్రములు, శంబుకునినుండి వెలువడిన దివ్యతేజము కవి కాల్పనికములు అట్లే భారతము మొదటినుండి చివరివరకు లోకవృత్తమే కొట్టకొనను కల్పింపబడిన ప్రస్థానముమాత్రము కాల్పనికము అలౌకికము

అట్లే అంతయో యింతయో లోకవృత్తము లేకుండ కావ్యము నిర్మితముకాదు కళాపూర్ణోదయమునందు రంభామాయారంభల సంవాదము నలకూబర కుహనా నలకూబరుల తగవులాట లోకవ్యవహార సూచకములు

"అంత మదింపకువేయని పల్కిన నంత మదింపకుమే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కిన గంతు లడంచెద లెమ్మనుచున్
రంతుల నేమిఫలంబని పల్కిన రంతులనేమి ఫలంబనుచున్
బింతము చూడగదేయని పల్కినఁ, బింతము చూడగదేయనుచున్"

"ఒకతె మగనికి నాపించు టొప్పదనిన నొకతె మగనికి నాపించు టొప్పదనుచు" ఇరువురు రంభలును కలహమాడిరి ఇది లోకవ్యవహారమున సుప్రత్యక్షము ఒకతె ఒక మాటాడెనేని రెండవదియు అదియే అనును అర్థముకూడ గ్రహింపదు కాని పురుషులైనచో అట్లుకాదు పురుషుల తగవు భుజబలముతోనే ప్రారంభింపబడును అట్లుకాకున్న తత్తుల్యముగనైన అంతియేకాని మాటలపై మాటలు పేర్చుట ఒకని నొకడనుకరించుట జరుగదు నలకూబర మణికంధరుల తగవులాట దీనికి తార్కాణము

"ఇదె ఖండించెద నీని మామక మహాహేతిప్రకాండంబుచే
దుద శోధించెదుగాని నీకుఁగల యుత్కృష్ణ నాపత్యమున్"

అనుచు నలకూబరుడు మణికంధరుని సంహరించుటకే సన్నద్ధుడైనాడు తాను మణికంధరుని చంపునట! అపిమ్మట సత్యాసత్యములు సంశోధింపవలయునట! ఇట్టిదేకదా ఉద్రేకగ్రస్తవివేకము, పురుషుల కలహ మన్నివిధముల ఈ కలహమును బోలియుండుటలో సందియములేదు అట్టులే సిద్ధునివంటి మాయావేషు లేవారును లేకపోరు వారిచే వంచింపబడు అమాయికులును లేకపోరు

ఇట్టులే కావ్యములందు లోకవృత్తము యత్రతత్ర కన్పట్టుచుండును కాని కేవలము లోకవృత్తప్రదర్శకములగు కావ్యములే యున్నయెడల వానికి శాశ్వతత్వము లభ్యముకాదు. మానవుని దైహికజగత్తు కేవల వస్తుజగత్తుచేతనే తృప్తిపడును కాని మానసిక జగత్తు తద్భిన్నమగు తత్త్వమునకై అన్వేషించును అందువలననే తత్త్వములేనిచో కవిత్వమునలేదు తాత్త్వికుడు కాగలిగినపుడే కవి లోకశ్రేయస్సంవిధాయకమగు కవితాసృష్టి గావింపగల్గును "తాత్త్వికుడుకాని కవి కవికాడు"—రవీంద్రుని వచనము ఇచ్చటను వేదాభిప్రాయము ఉండుట కాస్కారముకద్దు

కి వెన్నెల

"సత్యమునందు సౌందర్యమున్నది—కాని స్వాభావికత్వమునకాదు; కవిత్వము సృజనము—కాని అనుకరణముకాదు" అన్న రవీంద్రుని వక్కాణ యథార్థమును ప్రకటించును బాహ్య నేత్రములకు గోచరమగునది మాత్రమే సత్యమనియు తక్కిన దంతయు అసత్యమనియు తలపరాదు కవిత్వము పాక్షికముకాదు సమగ్రము దృశ్యము, అదృశ్యమునగు ఉభయసత్యములను సమన్వయపరచి ప్రదర్శించుటచే కవిత్వము లక్ష్యము మానవుని భావజగత్తు ఉభయలోకసంస్థిత సత్యసందర్శనమునసే ప్రశాంతిని పొందగల్గును

సాహిత్యము బౌద్ధిక మానసిక వృత్తుల సామంజస్యము వ్యక్తము, అవ్యక్తమునగు విషయముల యేకత్వము సాహిత్య వ్యక్తమై కవిత్వమున ప్రసక్తమగును

భారతదేశము దాస్యబంధమునకు పాల్పడిన అనంతరము తన అస్తిత్వమును గోల్పోయినది అనుకరణను ప్రారంభించినది పాశ్చాత్యదేశములతోడి సాంగత్యమువలన ఆయాదేశముల ఆచార వ్యవహారములు భాషావేషములు ప్రాప్తించినవి మంచిచెడ్డల విషయముతో మనకు పనిలేదు కాని దానిఫలితముగా గద్యము ఖండకావ్యము నాటకము ప్రహసనము మున్నగు సారస్వత కళా భేదములు మన సాహిత్యమున చేరినవనుట మరవరానిది వర్డ్సువర్త్ బైరను కీట్సు మొదలగు కవివరుల రచనములకు అనుకరణలు బహుముఖములుగా బయలువెడలినవి కళకోసమే జీవిత మనువట్లుట కావ్యరచనము సాగినది. అందును కవితావృత్తము శ్రేయసికొరకు పరితపించిన ఎందుగుండె విషాదనివేదనము బ్రతుకు బరువై, కాలచక్రముక్రింద పడి, నలిగి నెత్తురు చిమ్మ దిక్కులేక చేసిన యాక్రందనము పుష్పవాటికయందు తేనెకొరకు అన్వేషించు తేటిపాట కప్పించని కాంతికొరకు విప్పించని నాదముకొరకు వెదకులాడిన యాత్రికుని జీవితవిశేషము

ఇవన్నియు రూఢములగు సత్యములు బాహ్యలోచనములు పరికించలేకపోవచ్చును కాని సంస్కారముగల హృదయము వానిని గ్రహించుటలో సర్వవిధముల సమర్థము

"కరుణ పట్టున కీ చిర్పగానిచేయి
దాచికొనినాద మృత్యుఘోషమ్మె మరచి
పట్టియలుప వాకమోదు చెట్టువోలె
ఎత్తినది కరమెత్తినట్టే కృశించె—శ్రీ కృష్ణశాస్త్రి

పై పద్యము చదువునపుడు "కాఫీ హోటలు" సమీపములో బాబ్రక్క బిచ్చగాడు చెయ్యిచాచుకొనుట అదే సమయములో ఒక "కారు" అతనిమీదినుండి పోవుట—మనకు భావనాపథమున గోచరించును మన హృదయము విహ్వలతనొందును; విలవిల కొట్టుకొనును కొంతకాల మాగినకాని తరువాతి పద్యమును చేరలేము. కవి ప్రణయభిక్షకు చేయి చాచినాడు కాని పొందియున్న మృత్యువును గుర్తింపలేదు తత్క్షణము మృత్యువాతనిని కబళించివేసింది ఎత్తినచేయి ఎత్తినట్లే మిగిలిపోయినది ఎంత విదారము! అంతే కాదు నల్గురు చూడని జీవిత మాతనిది ఎడారిలో ఎండిపోయిన వృక్షశాఖవలె నిలిచిపోయిన దాతని హస్తము నిలిచిపోయెడు హస్తము నిలువవచ్చును కాని వాలుగు కన్నీటిచుక్కలు— అభిమానార్ద్రనయనములు లేవి ఆ మరణముకంటె దుఃఖకరము, వేదనాభరము అనువిషయ మింకేమి కలదు? హృదయమును పరపరకోయు ఈవర్ణనము మన కింత సన్నిహితమగుటకు కారణము తరంతర్లీనమై ప్రవహించు సత్యస్రవంతి; పరోక్షమునసుండి ప్రతిఫలించు లోకగతదారుణ దుఃఖము

"వలపుటాకలి ప్రముక్కు నా బ్రతుకుమీద
ఇనుప పాదాల నిడి లోకమిపుడు నడుచు"—శ్రీ కృష్ణశాస్త్రి.

కవి స్వాతంత్ర్యము సాంఘిక నిర్బంధములచే దెబ్బతిన్నది లోకముపోని పౌరుష్య మాతని వాడిపోయిన హృదయమును నలిపివైచినది అంతఃకరణ వైశాల్యమును పరిమితము చేసినది

"రెండు పొలిమేర లొక్కటైన రేఖమీద
నేను నీ యొడియందున మేనువంచి
నిదురకోడును జోలపాడుదువు నీవు
చిచ్చికొట్టుచు చీకటుల్ విచ్చుదనుక"—శ్రీ నాయని

తన ఒడిలో పండుకొనబెట్టుకొని తన తల్లి కవిని జోకొట్టుచు జోలపాడుచు రాత్రి కడచుదనుక నిదురింపజేసెను ప్రతి మాతృజీవియు శిశువు నట్లే చూచును కాని కవి తన పదముల తూగుతో మనల నూగిసలాడించుచు రెండు పొలిమేరలు కలిపినది. పశువ్యయత కన్నది—ఆ ఒడి ఆ ఒడిలో నిద్రపోయిన కవి కాలవశాత్తు అట్టి సుఖమునకు దూరమైనారు అప్పుడు అట్టివాని దుఃఖ మపారము ప్రతివస్తువు తన శోకమునకు బొల్పణ్యము కలిగించును

"షకు స్నానమ్మునకు బావి కేగునపుడు
లేతసూర్యుని బంగరుపూతలందు
మురియుచును దల్లియొద్దను ముద్దుగొనుచు
"అమ్మ ఏదిరా?" అన్న వా యలలు వన్ను
నైని వేంచేసి యూపిరి పట్టుకొనుచు
చిన్ని తావేలు వన్ను పీడించి జలము
త్రవ్వుకొనుచేగె కూవగర్భమున దాగ
తైవలంపుకొన్న మళ్లు నాపాల నివరి
"నీకు లేదమ్మ" యన్నది నీటిపాము

పైకెగసి యొక్క కప్పను బట్టుకొనుచు
నాకు లేదమ్మ యన్నను శోకవహ్ని
తప్త హృదయుండనై యుంటి దారివట్టి" — శ్రీ నాయని

గాలి రేగిన అలలు కూలము తాకుట సత్యము కాని ఆ తరగలు తన్ను ఎకసక్కెమాడుచున్నట్లు తోచినది మాత్ర హీనుడగు కవికి మనుష్యుల అలికిడికి నీటిపైనున్న తాబేలు చేపలు లోనికిపోవును నీరు కదలిక నొందును అందువలన వలయము లేర్పడును కాని ఎంత ప్రశాంతుడగు కవికి తాబేలు తన్నవమానపరిచి తనపై ముదుటు ఎదిరించి మరుగునపడినట్లు తోచినది నీటిపాము పైకెగసి కప్పను పట్టుకొన్నది అదియును నీకు అమ్మలేదు అన్నది ముమ్మందు విచారముతో కుందుచున్న డెందము పైని అవమానపరంపర గుండె బరువెక్కినది కవి కిప్పుడు ఏ వాడు లేదమ్మ అన్నాడు విచారముతో వెనుదిరిగినాడు అకట విశ్వమునకు సుఖము చెల్లలేదు దుఃఖములోమున్న మానవుడు పై విధి ప్రవర్తించుటలో ఆశ్చర్యమేమున్నది లేనిమాటలనుకూడ వినగలదన్న వింత ఏమున్నది

కాని కాలిన హృదయము కాలినట్లు కన్పించదు విశ్వకవి రవీంద్రుడు ఎంచినట్లు శిరములు రక్తము స్రవించుచున్నను ఉన్నతములు

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు కన్నులకు కట్టినట్లు సత్యమును కవనరచన అతని కవిత్వమునకు ఆధారమేమి లేదు తత్త్వము మాత్రమున్నది తాను చూచినది చూచినట్లు బాధగా చెప్పగలడు

"పతితులార భ్రష్టులార
బాధాసర్ప దష్టులార
బ్రతుకుకాలి పనికిమాలి
శనిదేవత రథచక్రపు
టిరుసులలో పడినలిగిన
హీనులార దీనులార — శ్రీ శ్రీ

ప్రతిమానవుడును దుఃఖితుడే బాధితుడే ప్రపంచమున హతభాగ్యు లధికులు అందువలననే కవి సమాజమును సూటిగా సంబోధింపగలిగెను

ఇట్టిదే సాహిత్యమున ఏయుగమందైనను లోకోన్నతము ఉండకపోదు లోకములోని పద్ధతులు వ్యవహారములు ఆచారములు జీవితవిధానములు—ఏదోవిధిని కవిత్వమున ప్రతిబింబితములు కాకతప్పదు


సం॥ చందా రూ 6 0 0

# వినోదిని

విడి ప్రతి రూ 0-8-0

(నవ్యల మాసపత్రిక)

ఇరవై యేండ్లుగ నిర్విఘ్నంగా సాగుతూ తెలుగుదేశానికి యథోచితంగా సేవచేస్తున్నది ఈ ఇరవై ఒకటవ సంవత్సరంలో సర్వాంగసుందరంగా వెల్వరించేందుకు కృషిచేస్తున్నాం మా యీ కృషికి పాఠకులు రచయితలు చిత్రకారులు తోడ్పడ ప్రార్థిస్తున్నాం

ఏజెంట్లు లేనిచోట్ల ఏజెంట్లు కావాలి

వివరములకు

వినోదినీ కార్యాలయం,

౩౩ జోన్స్ వీధి జి టి మద్రాసు

# విద్యా సంస్కరణలు : షికాగో ముందంజ

ఫ్రెడ్ హెచింజర్

అమెరికాలో ఉన్నత విద్యాబోధన విషయంలో షికాగో విశ్వ కళా పరిషత్తు అత్యంత ప్రధానమైన సంస్థలలో ఒకటి. అమెరికాలోని విశ్వకళా పరిషత్తు పాఠ్య క్రమాన్నంతనూ మార్చివేసిన సంస్కరణను మొట్టమొదటగా అమలుజరిపి ఆ విశ్వకళాపరిషత్తు అటువంటి ప్రాధాన్యాన్ని సంపాదించింది. అటువంటి విప్లవాత్మక కార్యక్రమం ఇప్పుడు సర్వసాధారణంగా అమలుజరుగుతున్నది గనుక ఈ విశ్వకళాపరిషత్తు మరొకసారి ప్రజల దృష్టి నాకర్షించింది. ఐతే ఈ మార్పుకి కారణం ఈ ప్రయత్నం విఫలం కావడం కాదు. ఇందలి ప్రాథమిక అంశాలు ఎంతో ఆదరణ సాధ్యంగా వుండి మన సాధారణ బోధనాక్రమంలో అంతర్భాగమైపోవడమే.

ఆ విషయానికి సంబంధించిన సంక్షిప్త సమీక్ష ఇది. "ఎవరికి తోచిన చదువును వారు నిర్ణయించుకునే విధానం ప్రయోజన రహితమయింది. దీనిని ఎత్తివేయడానికి ఒక పథకాన్ని తయారు చేయమని షికాగో విశ్వకళాపరిషత్తు అధ్యక్షుడు డాక్టర్ రాబర్టు హచిన్స్‌కు సెనేటు సూచించింది. ఆ కాలంలో చాలా అమెరికన్ సంస్థలలో అమలులోవున్న విద్యావిధానం ప్రకారం విద్యార్థులు తాము చదవాలనుకున్న చదువులను వేటినైనా చదివేవారు. వారు చదువుతున్న చదువు దరిమిలా వారికి ప్రయోజనకారి అవుతుంది అన్న హామీ ఏమీలేదు. కొందరు విద్యార్థులు చాలా సులభమైన చదువులను మాత్రమే చదవడానికి నిర్ణయించుకొనేవారు. మిగిలిన వారు ప్రపంచజ్ఞానం అలవడడానికి అవసరమైన సాధారణ విద్యను కూడా పరిత్యజించి తమకు అభిమాన పాత్రమైన కఠిన విషయాన్ని గురించి ప్రత్యేక పరిశోధన చేయడానికి పూనుకొనేవారు.

ఈ పరిస్థితులు గమనించి కళాశాలలో చేరిన ప్రతివారు ప్రపంచజ్ఞానాన్ని అలవర్చుకొనడానికై మొదటి రెండేండ్లపాటు పూర్తిగా చదివితీరాలని డాక్టర్ హచిన్స్ వెంటనే నిర్ణయించారు.

పాఠ్యవిషయాలలోని వివిధ శాఖలను సాంఘికశాస్త్రాలు, వ్యాకరణాది శాస్త్ర విజ్ఞానం, జీవశాస్త్రాలు, శారీరక శాస్త్రాలుగా పునర్విభజన చేయాలని ఆయన నిర్ణయించారు. అమెరికాలో ఉన్నత విద్యావిధానం కొన్ని మార్పులతో ఈ పద్ధతినే రూపొందించ బడింది.

## ప్రత్యేక విద్యాభ్యాసం

విద్యార్థులకు అవసరమైన వివేకాన్ని పరిజ్ఞానాన్ని విద్యార్థులకు ప్రాథమిక పాఠశాలలోను ఉన్నత పాఠశాలలలోను బోధించడంవల్ల విశ్వకళా పరిషత్తులో వారికి వృత్తి విద్యకు ప్రత్యేక శిక్షణ ఇవ్వాలనే మూలసూత్రాన్ని ఈ నూతన విద్యా ప్రణాళిక తయారు చేయబడింది. కాని పాఠశాలలో బోధించే విద్యకు విశ్వకళా పరిషత్తు బోధించే విద్యకు మధ్య ఒక అగాధం ఏర్పడింది. మానవాళికి సంబంధించిన సాధారణ సమస్యలను పరిష్కరించడానికి కావలసిన పరిజ్ఞానం విద్యార్థులకు బోధించడం జరగలేదు. ప్రజాస్వామిక వ్యవస్థలో అటువంటి విజ్ఞాన బోధ అత్యంత ప్రధానమైన విషయమని భావించబడింది. అందువల్ల పాఠశాలలో బోధించే విద్యకు మధ్య ఏర్పడిన ఈ అగాధాన్ని పూడ్చడానికి తగినవిద్యను కళాశాలలో వారికి బోధించవలసి ఉన్నది.

దరిమిలా 1942 లో షికాగో విశ్వకళాపరిషత్తు మరొక అడుగు ముందుకు వెళ్ళింది. కళాశాలలో మొదటి రెండు సంవత్సరాలలోను బోధించే విద్య పాఠశాలల్లో చివరి రెండు సంవత్సరాలలోను బోధించే విద్యయొక్క పునరుక్తి మాత్రమేనని డాక్టర్ హచిన్స్ విశ్వసించారు. ఈ లోపాన్ని సరిదిద్దడానికిగాను సాధారణ పరిస్థితుల్లో ఇంకా రెండు సంవత్సరాలపాటు ఉన్నత పాఠశాలల్లో విద్య నభ్యసించవలసివున్న విద్యార్థులను పదిహేను పదహారు సంవత్సరాల వయసువారిని విశ్వకళాపరిషత్తులో విద్య నభ్యసించడానికి చేర్చుకున్నారు. విద్యార్థుల శక్తిసామర్థ్యాలను జాగ్రత్తగా పరీక్షించి వయసుతోగాని వారి పూర్వపు చదువుతోగాని నిమిత్తం లేకుండా వారి శక్తి సామర్థ్యాలను తగ్గ పనికి వారిని నియమించేవారు.

ఈ పథకంవల్ల విద్యార్థులంతా అన్ని తరగతులు చదివితీరాలనే నిబంధనకూడా విధించబడింది. తాను అభ్యసిస్తున్న విద్య యొక్క సారాంశాన్ని గురించి నిర్ణయించే బాధ్యత పూర్తిగా విద్యార్థికే వదలవేయకూడదని, ఐతే తాను పాఠశాలలోకాని తనకు తానుగాగాని అటువంటి కృషి చేయాలనే బుద్ధి కుశలతను అతడు కలిగివుండేటట్లు చేయాలని ఈ నూతన విద్యాసంస్కర్తల వాదం. ఇందువల్ల విద్యాధికారులు విద్యార్థులను తమ చెప్పుచేత

ంలో ఉంచుకోవడానికీ, కొంతవరకు వారికి స్వేచ్ఛనివ్వడానికి కూడా వీలయింది

ఈ నూతన పథకం రాగానే అమలు జరిగింది. షికాగో విద్యార్థులు మంచి పేరు సంపాదించారు. ఇతర విద్యాసంస్థలలో పాతపద్ధతుల ప్రకారం విద్య నభ్యసిస్తున్న విద్యార్థులతో జరిగిన పోటీల్లో వీరు బాగా నిలబడగలిగారు.

## కొత్త సమస్యలు

ఇవన్నటికీ క్రాంత్రమేణా కొత్త సమస్యలు ఉద్భవించాయి. తమ పిల్లలకు కళాశాలల్లో చదువు చెప్పించడానికి అందరూ సంసిద్ధులు కాలేదు. కొన్ని వృత్తిపాఠశాలల్లో ముఖ్యంగా వైద్య పాఠశాలల్లో విద్య నభ్యసించడానికి పూర్వం ఇంకా కొంత అదనంగా విద్యాభ్యాసం విద్యార్థులకు అవసరమయింది. అన్నిటికన్న ముఖ్యవిషయం ఉన్నత పాఠశాలల పాఠ్యక్రమం బాగా అభివృద్ధి పొందించబడింది. ఉన్నత పాఠశాలా విద్యావిధానం, కళాశాల విద్యావిధానంతో సమన్వయపర్చడానికి మరిన్ని జాగ్రత్తలు తీసుకోవబడినాయి. ఈ అభివృద్ధికరమైన మార్పుల కారణంగా ఉన్నత పాఠశాలల్లో విద్యార్థుల విద్యాభ్యాసం పూర్తికాకముందే వారిలో కొందరు తెలివైన విద్యార్థులను ఎంచి కళాశాలల్లో విద్యాభ్యాసానికి అర్హులుగా నిర్ణయించవలసిన అవసరం తగ్గిపోయింది.

ఏమైనా, ఈ కారణాలన్నిటివల్లనే, షికాగో విశ్వకళాపరిషత్తువారు ఉన్నత పాఠశాలల్లో విద్యాభ్యాసం ముగించిన విద్యార్థులకు మాత్రమే నాలుగేళ్లపాటు కళాశాలల్లో విద్యను బోధిస్తామని ప్రకటించారు. ఐతే కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో మాత్రమే ఈ నిర్ణయాన్ని సడలిస్తామని వారు సూచించారు.

కళాశాలలు ఇంతవరకూ కేవలం సాధారణ విద్యాబోధనకే కృషిచేసేవి. కాని అటువంటి విద్యాబోధ ఈ చతుర్థ సంవత్సర బోధనా పథకంలో కూడా ఒక అంశంగా ఉంటుంది. ఇది గమనించతగ్గ విషయం.

కళాశాలల్లో రెండు సంవత్సరాలపాటు విద్యనభ్యసించిన అనంతరం విద్యార్థులు ఒక అభిమాన శాస్త్రాన్నిగాని మరికొంత సాధారణ విద్యను గాని అదనంగా అభ్యసించవలసి వుంటుంది.

అమలులోవున్న విద్యావిధానాన్ని పూర్తిగా మార్చివేయడానికై రూపొందించబడిన ఈ విధానం, తీవ్రమైన తర్కాలను వేటికీ దిగనవసరములేకుండానే చాలావరకు సాధించబడింది. అని ఇందువల్ల తేలింది. అమెరికా దేశపు ఉన్నత విధానంలో ఈ సంస్కరణ అమలు జరగడం పూర్తి అయింది.

—●●●—


# రూ. 2500 ఉచితము

## మీరు కోరినది పొందండి



నీ విధురేమీ తెంగవల నక్కరలేదు. ఈ ఉంగరం ధరించుటవలన అన్నింటిలోను జయము పొందవచ్చు. ఎంతటి పాషాణహృదయంగల స్త్రీ పురుషులైననూ, నీస్వాధీనమై, నిన్ను ప్రేమించుటయేగాక నీ పాదదాస్యము చేయుచు నిత్యము నీకు దాసినయై సంచరించును. వ్యాపారము పండెను. పరీక్షలు మొదలైనవాటిలో ఇది జయము చేకూర్చును. గొడ్రాలికి పుత్రుడుదయించును. చనిపోయిన వారితో సంభాషించవచ్చు. తాత తండ్రులు దాచిన రహస్య ధనముల సంగతి నీకు కలలో తెలియచేయును. దుష్టనక్షత్రాల చెడుఫలాలను అణచివేసి, అపాయకరమైన రోగాలనుంచి రక్షించును. ఇటు సూర్య రటు ఉదయించవచ్చు గాని ఈ ఉంగరం శక్తి ఎన్నడూ వృధాకారు. నూటికి 100 పాళ్లు విజయం లభించును. వెల 12 అణాలు. ప్రత్యేకం రూ 2. ఇంకా ప్రత్యేకాధిక్యమైన శక్తివంతమైనది 2-12-0

ఇది అబద్ధమని రుజువు చేసినవారికి రూ 1600 బహుమతి ఇవ్వబడును. నచ్చనిచో ధనం వాపసు చేయబడును. ఇంగ్లీషులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరపండి.

BENGAL MAGIC HOUSE, Sikh Temple, (Dept. 288/15) AMRITSAR.

# సమాప్తి

రచన:
రవీంద్రనాథ ఠాకూర్

అనువాదము:
కారుమూరి వైకుంఠరావు

అపూర్వకృష్ణ బి ఏ పాస్‌అయి కలకత్తా నుండి ఇంటికి తిరిగివస్తున్నారు

గ్రామము ప్రక్కనున్న నది చాలా చిన్నది వర్షకాలము అంతమయేసరికి పూర్తిగా ఎండిపోతుందనే చెప్పవచ్చు. ఇప్పుడు శ్రావణాంతము గట్లుతీసి పారుతున్నది. గ్రామస్థుల పెరళ్లలోని చెట్లను, గ్రామములోని వెదురుపొదలను ముద్దుపెట్టుకొని ప్రవహించుకు పోతున్నట్టున్నది

బాగా వర్షము కురిసి కురిసి తెరిపి ఇచ్చింది, మేఘము విడిచి ఉజ్జ్వల సూర్యకాంతి పడుతున్నది

పడవమీద కూర్చొనియున్న అపూర్వకృష్ణుని మనస్సులోనికి మనము చూడగలిగితే అందులోకూడా ఒక నదీప్రవాహం సూర్యకాంతిలో తళుకు తళుకుమని మెరుస్తూ గాలికి కలకల శబ్దముచేయుచుంటూ నవవర్షజలముతో గట్లుతీసి పారుతుండడము కనబడుతుండును

పడవ రేవుకు వచ్చి నిలబడ్డది నదిఒడ్డు నుండి తన ఇంటికప్పు చెట్లమధ్యనుండి కనబడుతుంటుంది అవాళ అపూర్వ వస్తున్నాడని ఇంటివాళ్లెవరికీ తెలియదు తనకనే అతనికోసము మనిషి ఎవరూ రాలేదు. పడవవాడు బ్యాగ్ పట్టుకోబోయేటప్పటికి అపూర్వ వద్దని తానే బ్యాగ్ పట్టుకొని ఉల్లాసముతో తొందర తొందరగా పడవ దిగాడు.

దిగేసరికి ఒడ్డు బురదగా ఉన్నది, కాబట్టి అపూర్వ బ్యాగ్ సమేతముగా బురదలో పడ్డాడు. అతను పడిపడడముతో తియ్యని కంఠములోనుంచి తరళహాసము ఒకటి తెరలుతెరలుగా పైకివచ్చి ఎక్కడో పుట్టి ఆదగ్గిర రావిచెట్టుమీదనుండే పక్షులను లేపింది

అపూర్వ మిక్కిలి సిగ్గుపడుతూ లేచి తనమటుకు స్వాధీనపరచుకొని ఇటూఅటూ చూశాడు వర్తకు లెవరో నావలమీద దిగుమతిచేసిన ఇటుకలు గట్టుమీద కుప్పగా పేర్చబడి ఉన్నవి, దానిమీద కూర్చొనియున్న అమ్మాయి ఒకతె ఆపుకోలేక ఆపుకోలేక పక్కుమనివిరిగిపట్టు నవ్వుతున్నది

చూచి అపూర్వ పోల్చుకున్నాడు—తన ఇంటి పొరుగున కొత్తగావచ్చినవాళ్ల పిల్ల మృణ్మయి ఆ అమ్మాయి అక్కడికి చాలాదూరాన పెద్ద నదీతీరాన ఉండేది వాళ్ల ఇల్లు నదిఒడ్డు కోసుకుపోవడంచేత ఆ ప్రాంతాలు విడిచిపెట్టి ఈ గ్రామానికి వచ్చి, రెండు మూడు సంవత్సరాలయింది

ఈ అమ్మాయినిగురించి అపఖ్యాతి మాటలు ఆ గ్రామస్థుల నోట వస్తూండేవి మగవాళ్లలో చాలామంది స్నేహభావముతో ఈమెను పాగ్లీ—పిచ్చిదానా—అని పిలిచేవారు కాని ఆడవాళ్లు మాత్రము ఈమె ధోరణిచూచి దిగులుపడేవారు ముందుకు ఈమె గతి ఏమవుతుందని సంకోచించేవారు గ్రామములో ఉండే మొగపిల్లకాయలే ఈమెకు జట్టుగాళ్లు ఆడపిల్లలను చూసి హేళనచేసేది. పిల్లల రాజ్యానికి ఈమె ఒక గొప్ప ఉపద్రవమువంటిది అని చెప్పవచ్చును

తండ్రికి ఈమె ముద్దుబిడ్డ తనకనే ఈమె అల్లరికి మితి ఉండేదికాదు ఆమె తల్లి తనభర్తమీద ఈవిషయమై సదా ఫిర్యాదు చేస్తుండేది అయినా తండ్రి పిల్లను అమితముగా ప్రేమిస్తుండేవాడు. మృణ్మయి కంట నీటిబొట్టు రాలితే భరించలేకపోయే వాడు విదేశములో ఉన్నదని తండ్రి మాట మనస్సులో పెట్టుకొని పిల్లను ఎందుకూ ఏకారణముచేతనూ ఏటవనిచ్చేదికాదు తల్లి

మృణ్మయిది చామనఛాయ, పొట్టి ఉంగరాలజుట్టు వీపుదాకా పడుతుండేది చూడడానికి మొగపిల్లవాడిలాగు ఉండేది నల్లని పెద్దపెద్ద కళ్లు, వాటిలో సిగ్గుగాని, సంకోచముగాని ఆడపిల్లల కుండవలసిన హావభావాలేవీగాని ఉండేవికావు తీరిన అవయవాలతో పొడవుగా ఉండేది బలమైన స్వస్థతగల శరీరము కాని ఆమె వయస్సు స్వల్పమా అధికమా అనే యోచన చూచేవాళ్లెవరికీ కలిగేదికాదు కలిగిఉంటేమాత్రము ఇంతవయస్సువచ్చినా ఇంకా పెళ్లిచేశారు కాదని తల్లిదండ్రులను నిందించిఉందురు. విదేశమునుంచి వచ్చిన జమీందారుగారి నావ రేవులో కట్టిననాడు గ్రామస్థుల భయభక్తులు అధికమయేవి అందరూ గడబిడపడుతూండేవారు రేవుకు నీళ్ళకువచ్చిన గ్రామవధువుల ముఖరంగభూమిమీదను ముక్కుచివరవరకు ముసుగులు తెరలవలె దిగేవి జమీందారుగారి అబ్బాయి కలకత్తా నుండి వచ్చిననాడు మృణ్మయి ఒంటిమీద బట్టలేని ఒక పసిబిడ్డను ఎత్తుకొని తన ఉంగరాల జుట్టు ఆడించుకుంటా రేవుకు

పరుగెత్తుకు వచ్చింది వేటగాళ్లుగాని మరి ఎట్టి ఇతర ప్రమాదాలుగాని లేని ప్రదేశము లోని లేడిపిల్లవలె మృణ్మయి కుతూహలం ముతో నిర్భయముగా చూస్తూ నిలబడ్డది పిమ్మట తన జట్టు అబ్బాయిల దగ్గిరికివచ్చి తానుచూచిన వింతను సవిస్తరముగా వర్ణించింది

ఇంతకుపూర్వము సెలవులలో ఇంటికి వచ్చినప్పుడు మన అపూర్వ మృణాలిని రెండు మూడుసార్లు చూచాడు చూచి సమ యము దొరికినప్పుడు—దొరికినప్పుడేమిటి— దొరకనప్పుడుకూడాను—ఆ బంధరహిత బాలికనుగురించి ఆలోచిస్తుండేవాడు లోక ములో అనేకముఖాలు మనకంట పడుతుం టవి అందులో ఏదో ఒకటి మనకు తెలియ కుండానే మన మనస్సులోపలికి దూరి పోతుంది ఆ ముఖములో ఉండేది సౌంద ర్యముముకాదు ఇంకేదో గుణముంటుంది ఆ గుణానికిని స్వచ్ఛత అని పేరుపెట్ట వచ్చును లోపలఉండే మనుష్యప్రకృతి అనేక ముఖాలలో పరిస్ఫుటముగా తనను వ్యక్తపరుచుకోలేదు అంతరగుహవాసి అయిన ఆ రహస్యమానవప్రకృతి ఏముఖము చూసి ఎట్టి అడ్డుపెట్టుకోకుండా వికాసము పొందుతుందో ఆ ముఖము వేయిముఖాల మధ్యనైనా ప్రకృతి నాకర్షిస్తుంది అది మన హృదయాలలో ముద్రితమైపోతుంది అతి వేగముతో విచ్చలవిడిగా పరుగెత్తుతున్న అరణ్యమృగమువలె ఏ నిర్బంధానికీ లొంగని దురంతరవారీప్రకృతి ఆ బాలిక ముఖములో ఎల్లప్పుడూ కనబడుతుండేది కనుకనే జీవనముతో కలకల్లాడుతుండే ఆ అమ్మాయి ముఖము ఒకసారిచూస్తే ఎన్నడూ మరువలేము

కుతూహలముకొద్దీ ఆ అమ్మాయి నవ్విన నవ్వు వినడానికి బహుఇంపుగా ఉండెను, కాని అపూర్వుని మనస్సుకు మాత్రము కొంచెము బాధ కలిగించిందని పాఠకులకు వేరే చెప్పనక్కరలేదు అపూర్వుడు కాలు జారిపడి లేచి ముఖ మెత్తరచేసుకొని, బ్యాగ్ పడవవారిచేతికి ఇచ్చి ఇంటివైపుకు బయలు దేరాడు

అతిసుందరమైన దృశ్యము—నదీతీరము, వృక్షఛాయ పక్షుల సంగీతము ప్రాతః కాలపు సూర్యకాంతి ఇరవై సంవత్సరాలు వయస్సుగల యువకుడు ఇటుకల కుప్ప వర్ణించదగినదికాదు నిజమే కాని పైన కూర్చొనిఉన్న రమణి ఆ ఇటికలపైకూడా మనోరమశ్రీని విస్తరిస్తుండెను పాపము ఇటువంటి దృశ్యములో మొదటి అడుగు పెట్టీపెట్టడముతో ఆ రసవత్తరమైన కావ్యాన్ని ఈవిధముగా ప్రహసనముగా మార్చుతమకంటె భాగ్యదేవత చెయ్యగల క్రూరకృత్య మేమి ఉండగలదు?

## 2

ఆ ఇటుకకుప్ప శిఖరమునుంచి ప్రవ హించివచ్చిన హాస్యధ్వని వింటూ బురద పూయబడి బ్యాగ్ కండువాలతో చెట్లనీడల గుండా నడుచుకుంటూవచ్చి అపూర్వుడు ఇల్లు చేరాడు, అపూర్వకు తండ్రిలేడు ఆశించ కుండా కొడుకు ఇంటికి రావడముచూచి తల్లి దేహము పులకరించింది తక్షణమే పాలు పెరుగు నారకాయలు మొదలైనవాట్ల కోసము అన్నివైపులనూ మనుష్యులు పరు గెత్తారు ఇరుగుపొరుగువాళ్లకూ పేటలో వాళ్లకూకూడా సందడిగా ఉండెను

భోజనమైనతరువాత తల్లి అపూర్వ పెళ్లిమాట ఎత్తింది తల్లి పెళ్లిమాట ఎత్తు తుందని కుమారుడు ఎరుగును—చాలాకాలము నుండి తల్లి తొందరపడుతుండెను కాని నవయుగతంత్రాన్ని అనుసరించి కుర్రవాడు బి ఏ పాస్ కానిదే పెళ్లిచేసుకోనని పాట పాడుతుండెను పరీక్షకొరకు తల్లి ఇన్నాళ్లూ కనిపెట్టుకొనిఉండెను, ఇప్పుడు మరి ఏ మిషా పనికిరాదని అపూర్వ ఎరుగును. "పిల్లను చూచాక పెళ్లిస్థిరపరుద్దాము," అని తల్లి ప్రశ్నకు జవాబు చెప్పాడు అపూర్వ "పిల్లను చూచాను దానినిగురించి నీవు ఆలోచించనక్కరలేదు" అని తల్లి అన్నది తల్లి ఇలా అంటుందని అపూర్వ ఎరుగును కాని "పిల్లను చూడనిదే నేను పెళ్లికి ఒప్పుకోను" అని అన్నాడు "ఇటువంటి అద్భుతమైన పిల్లవాళ్లు ఎక్కడా ఉండరు! అబ్బాయి బుద్ధి!" అని అంటూ తల్లి పిల్ల వాడి మాటకు సమ్మతించింది

అపూర్వ ఆరాత్రి దీపమార్పి ఆ నిర్జన నిర్నిద్ర శయ్యమీద పడుకొనిఉండగా ఆ వర్షపురాత్రియొక్క సమస్తశబ్ద నిశ్శబ్దతను దాటిన అవతలి కాలప్రవాహపు ఒడ్డునుండి మధురమైన శ్రీకంఠములోనుంచి దాని ఉచ్చ హాసము తెరలుతెరలుగా వచ్చి అతని చెవిలో పడుతుండెను ప్రొద్దున్న కాలుజారి పడినదానికి ఏదో తగిన దిద్దుబాటుచేయాలనే తలంపు అతని మనస్సును బాధించడము మొదలుపెట్టింది "నేను అపూర్వకృష్ణననీ, ఉన్నతవిద్య నభ్యసించినవాడననీ చాలా కాలము కలకత్తానగరములో నివాసముచేసి వచ్చాననీ దురదృష్టమువల్ల కాలుజారిపడితే నన్నుచూచి నవ్వకూడదనీ నేను ఆ గ్రామ ములోఉండే పనికిమాలిన యువకులలో ఒకణ్ణికాననీ, నేనంటే అంత నిర్లక్ష్యముగా ఉండకూడదనీ ఆమెకు తెలియదు"— అపూర్వ పరుపుమీద పడుకొని ఈవిధముగా అనుకుంటూ బాధపడుతున్నాడు

మర్నాడే అపూర్వ పిల్లను చూడడానికి వెళ్లాడు పిల్ల ఇల్లు అట్టే దూరములేదు, తమ పేటలోనే ఉన్నది కొంచెము శ్రద్ధతో ముస్తాబయినాడు ధోవతిమీద సిల్కుజుబ్బా, సిల్కుకండువా తలకు గుండ్రని పగిడీ, కాళ్లకు వార్నిషుజోళ్లు సిల్కుగొడుగుతో ఉదయమే బయలుదేరాడు

కాబోయే మామగారిఇంట్లో అడుగుపెట్టే సరికి గొప్పసందడి చేశారు అనమయ ములో గుండె దడదడ కొట్టుకుంటూన్న వణుకుతున్న ఆ అమ్మాయిని దులిపి, తుడిచి, ముఖానికి పౌడరురాసి, ముచ్చటంగారు

రేకులతో కొప్పుపెట్టి, నలకని రంగుచీరలో చుట్టపెట్టి తీసుకువచ్చి పిల్లవాడి ఎదుట కూర్చోపెట్టారు అమ్మాయి ముడుకులకు తగిలేటట్టు ముఖము వంచుకొని గదిలో మూలను కూర్చున్నది పిల్లకు ధైర్యం చెప్పడానికి ముసలి దాసి ఒకతె వచ్చి వెనుకను నిలుచున్నది తనఇంట్లోకి అనధికార ప్రవేశము చేయబోతున్న ఈ యువకుని పగిడీ వాచీగొలుసు నూగునూగు మీసాలు పరీక్షచేస్తూ అమ్మాయి చిన్నతమ్ముడు దొరకడు గదిలో నిలుచున్నాడు అపూర్వ కొంచెము సేపు మీసముమీద చెయ్యివేసి ఉంచి గంభీర స్వరముతో "నీవు ఏమి చదువుతున్నావు?" అని అడిగాడు బట్టలు నగలతో కప్పఉన్న ఆ లజ్జాస్తూపములోనుంచి ఆ ప్రశ్నకు జవాబు రాలేదు రెండు మూడు సార్లు అదే ప్రశ్న వేయగా దాసిది వెనుకనుంచి చేతితో పొడిచి ఉత్సాహపరిచినపైని ఆ బాలిక ఒక్క విసురున తొందరతొందరగా "నాల్గో వాచకము రెండోభాగము వ్యాకరణ పాఠము మొదటి భాగము భూగోళ వివరణము హిందూదేశ చరిత్ర" అని జవాబు చెప్పింది అంతలో బయట ఎవరో దబదబ నడుస్తున్నట్లు శబ్దమయింది ఆ ఉత్తరక్షణమే వీపుమీద జుట్టు ఆడించుకుంటూ ఎగశ్వాస తీస్తూ మృణ్మయి గదిలో ప్రవేశించింది ఈమె అపూర్వ కృష్ణుడివైపు చూడనైనా చూడక అమ్మాయి తమ్ముడు రాఖాల్ ని పట్టుకులాగటము మొదలుపెట్టింది రాఖాల్ అప్పుడు తన పరీక్షాశక్తి ప్రయోగించడమనే పనిలో ఉన్నాడు అక్కడనుంచి కదిలే ఉద్దేశము కనబరచలేదు దాసీది మర్యాదకు జడిసి బిగ్గరగా మాటలాడలేకపోయింది అయినా సాధ్యమైనంత తీవ్రముగా మృణ్మయికి చీవాట్లు పెట్టింది అప్పుడు అపూర్వకృష్ణుడు తన గౌరవాన్ని గాంభీర్యాన్ని కాపాడుకొంటూ తన పగిడీతలను ఆకాశానికి అంటిస్తున్నట్టు మీదికెత్తి నిటిగా కూర్చున్నాడు వాచీ గొలుసు గుండెమీద ఊగుతున్నది

మృణ్మయి జట్టుగాని మనస్సును కదిలించలేక వాడివీపుమీద గట్టిగా ఒక దెబ్బకొట్టి ఎదుట కూర్చున్న అమ్మాయి ముసుగును వెనక్కులాగి తుపానువలె వడిగా గదిలోనుంచి బయటికి పారిపోయింది దాసీది గొణుక్కొంటూ గద్దించింది అక్క ముసుగు జారిపోవడముచూచి రాఖాల్ పకపక నవ్వడమారంభించాడు రాఖాల్ కి వీపుదెబ్బ అన్యాయమని తోచలేదు ఇటువంటివి ఇచ్చిపుచ్చుకోడాలు వాళ్లల్లో తరుచుగా జరుగుతూనే ఉండేవి ఇంతేకాదు మృణ్మయిజుట్టు ఇంతకుముందు దాదాపు వీపుదిగువదాకా పడుతుండేది రాఖాల్ ఒకనాడు హఠాత్తుగా వెనుకనుంచి వచ్చి కత్తెరతో దాన్ని కత్తిరించేశాడు మృణ్మయికి కోపమువచ్చి అతని చేతిలోనుంచి ఆ కత్తెర తీసుకొని తన మిగతా జుట్టంతా తానే కెచ్ కెచ్ మని కత్తెరతో కత్తిరించేసుకొన్నది ఆమె ఉంగరాలజుట్టు చెట్టునుంచి రాలిపోతున్న నల్లద్రాక్ష గుత్తులాగు ముద్దలు ముద్దలుగా నేలపడిపోయింది వాళ్లిద్దరిలో ఇటువంటి శిక్షాప్రణాళి అమలులో ఉండెను

అటుపిమ్మట ఈ నీరసపరీక్షా సభ ఆట్టే సేపు నడవలేదు స్తూపాకారముతో కూర్చొని ఉన్న అమ్మాయి ఏదో ఉపాయమూలంగా తిరిగి పొడుగింపబడి దానితోకూడా అంతఃపురములోకి వెళ్లింది అపూర్వకృష్ణ బహు గంభీరముగా లేచి పలచని మీసముమీద చెయ్యితిప్పుతూ ఇంటికి బయలుదేరాడు ద్వారముదగ్గిరికివచ్చి చూచేసరికి అతని వార్నిషుజోళ్లు కనబడలేదు అందరూ నాలుగుమూలలా వెదికారు ఎక్కడా దొరకలేదు

ఇంటివాళ్లు చాలా సిగ్గుపడ్డారు చీకాకుపడ్డారు అదృశ్యాపరాధిని నానారకాల తిట్లు తిట్టారు వేరు ఉపాయములేక ఇంటి యజమాని పాతజోడు తొడుక్కొని పగిడీ పిల్కాదుస్తులతో ముస్తాబయిఉన్న అపూర్వుడు ఆ బురద గ్రామవీథిలో జాగ్రత్తగా నడుచుకుంటూ ఇంటికి వెళ్తున్నాడు


వైబ్రొ
గర్భాశయ రోగ నివారిణి
సుప్రసిద్ధ బలవర్ధ కౌషధము. సర్వవిధ బహిష్ఠ చిక్కులను పూర్తిగాపోగొట్టి సత్సంతానమును కలుగజేయుటలో మా వైబ్రో మిక్కిలి ఘనత వహించినది. అన్ని షాపులలో దొరకును.
స్టాకిస్టులు: అప్పా అండు కొ. మద్రాసు.
కృష్ణా వేబరేటరి, బెజవాడ.

పడుస్తూ నిర్జనముగానున్న చెరువుగట్టుమీది దాకా వచ్చేసరికి మళ్లా ప్రొద్దున్నవిన్న నవ్వు ఆ మధుర కంఠములోనుంచే పుట్టి హాస్యకల్లోలాన్ని నలుదిక్కులా పంపసాగింది పొత ప్లిప్పర్లలో దాగని అపూర్వుని అనందర్ప వేషాన్ని తరుపల్లవాలమధ్యనుండి చూచి చూచి కౌతుకప్రియురాలైన వనదేవత నవ్వు ఆపుకోలేకపోయిందేమో అని అతనికి తోచింది

అపూర్వ తత్తరపడుతూ ఇటూ అటూ వెదు చున్నారు అంతలో దట్టముగానున్న చెట్ల మధ్యనుంచి అపరాధిని సిగ్గులేకుండా అపూర్వుని ఎదుటికివచ్చి అతని కొత్తకోళ్ల జతను ముందరపెట్టి పారిపోబోయింది అపూర్వ పరిగాపెళ్లి ఆమె చేతుల రెండూ పట్టుకొని ఆమెను ఖైదీచేశారు

మృణ్మయి ఇటూఅటూ విరగబడి అతని చేతులలోనుంచి తప్పించుకు పారిపోదామని ప్రయత్నించింది కాని నెగ్గలేకపోయింది ఏందుముఖాన నవ్వు—ఆ ముఖముమీదనూ ఆ ఉంగరాల జుట్టుమీదను చెట్లకొమ్మల మధ్యనుంచి తప్పించుకువచ్చిన సూర్యకిరణాలు పడుతున్నవి సూర్యకిరణాలుపడి తళతళ్యాడుతూ ప్రవహిస్తున్న నిర్మలజల ప్రవాహముపైపు కళ్లుదించి పథికుడు కుతూహలముతో చూస్తుంటాడు అదేమో స్తరగా మెరుపువంటి చంచలనేత్రాలతో మీదికి చూస్తున్న మృణ్మయి ముఖము వంక అపూర్వ గంభీరముగా కొంచెముసేపు చూచి కర్తవ్యసాధనము అసాధ్యమనితోచి కాబోలు ఖైదీని మెల్లిమెల్లిగా విడిచిపెట్టేశారు అపూర్వ తనను పట్టుకొని రెండు దెబ్బలు కొట్టిఉంటే మృణ్మయి ఆశ్చర్యపొయ్యేదికాదు కాని ఆ నిర్జనపథము మధ్యను అటువంటి నిశ్శబ్దస్థితి అర్థము ఆమెకు బోధపడలేదు నృత్యమయి అయినటువంటి ప్రకృతియొక్క గజ్జెల గలగల వలె చంచలహాస్యధ్వని సమస్తాకాశాన్ని ఆవరిస్తున్నది అపూర్వకృష్ణ చింతానిమగ్నుడై నెమ్మదిగా అడుగులువేసుకొంటూ ఇంటికి వచ్చారు

## 3

అపూర్వ నానారకాల నెపాలుచెప్పి అంతఃపురములోకి వెళ్లడము తప్పించుకున్నారు ఒక స్నేహితుని ఇంట్లో విందుకు వెళ్లివచ్చారు అపూర్వ పెద్దచదువు చదివిన వాడు, గంభీరస్వభావము గలవాడు— అట్లాంటివాడు చదువురాని సామాన్యబాలిక ఎదుట తాను పోగొట్టుకున్న గౌరవము తిరిగి సంపాదించుకోవాలనీ ఆమెకు తన ఘనతను పూర్తిగా తెలియచేయాలనీ ఎందుకంత ఆందోళనపడుతుండెనో చెప్పడము కష్టము పల్లెటూరి అమ్మాయి ఒకతె అతడొక సామాన్యయువకుడని అనుకున్నంత మాత్రాన అతనికి కలిగిన నష్టమేమి? ఒక్కమారు అతనిని చూచి ఎగతాళిగానవ్వి పిమ్మట బుద్ధిలేని నిరక్షర రాఖాల్‌తో ఆడుకోడానికి ఆమె వెళ్లిపోవడములో మాత్రము తప్పేమి ఉన్నది? తాను "విశ్వదీపము"అనే మాసపత్రికలో పుస్తకవిమర్శ చేస్తుంటాడనీ తన ట్రంకులో ఎసెన్సు, బోత్సు రూలీనీ కంపెనీవారి కర్పూరము రంగు లెటరు పేపర్లు పుస్తకాలతో కలిసి హార్‌మోనియమ్ కూడా చీకటిగర్భములోదాగి తెల్లవారకముందు బయటికిపోతున్న ఉషస్సు వలె, బయటికి రావడానికి సిద్ధముగానున్నవని ఆ బాలికకు తెలియచేయాలని ఎందుకు అంత కోరుతూఉండెనో మనుష్యునిమనస్సు బోధపరుచుకోవడము కష్టము బి. ఏ. పాస్‌అయిన శ్రీయుక్త అపూర్వకృష్ణరాయ్ చంచలస్వభావముగల ఆ పల్లెబాలికదగ్గిర పరాభవము పొందడానికి ఎంతమాత్రము సిద్ధుడై ఉండలేదు సాయంకాలము ఇంట్లోకి వచ్చాక అమ్మ అడిగింది "ఏలాగు ఉందిరా బాబూ, పిల్ల నీకు నచ్చిందా?" అని

అపూర్వ కొంచెము తంగారుపడి, "చూచానమ్మా, అందులో ఒక అమ్మాయి నాకు నచ్చింది," అని అన్నారు

"ఎంతమంది అమ్మాయిలను చూసి వచ్చావురా?" అని తల్లి ఆశ్చర్యపోతూ అడిగింది

నాలుగు రకాలుగా ప్రశ్నించగా చివరకు తన పొరుగింటి శరత్‌బాబుగారి అమ్మాయి మృణ్మయిని కొడుకు ఇష్టపడ్డాడని తల్లి తెలుసుకున్నది

అపూర్వ స్వేచ్ఛగా మాట్లాడడానికి మొదట సిగ్గుపడ్డారు, కాని తల్లి బలవంతము చేయడము మొదలుపెట్టగానే పట్టుపట్టి కూర్చున్నారు—"చేసుకుంటే మృణ్మయినే పెళ్లిచేసుకుంటాను లేకపోతే నాకు పెళ్లే అక్కరలేదు" అన్నారు కర్రబొమ్మలాంటి ఆ రెండో పక్కిమ్మాయిమాట అనుకున్న కొలదీ అతనికి కన్నెల అంటే అసహ్యము కలుగుతూవచ్చింది

రెండు మూడు రోజులు ఉభయ పక్షాలూ నిష్ఠూర్యపుమాటలాడారు, పౌరుషము చూపించారు, కోపగించారు, భోజనము, నిద్ర మానారుకూడాను చివరకు అపూర్వే జయించారు మృణ్మయి చిన్నపిల్లఅనీ, ఆమె తల్లికి సరిఅయిన శిక్షణఇచ్చే సమర్థత లేదనీ, తనచేతిలో పడగానే ఆమె స్వభావములో మార్పువస్తుందనీ తల్లి సమాధానపరుచుకొన్నది ఆఖరికి మృణ్మయి ముఖము చాలా అందమైనదనికూడా నమ్మింది కాని తక్షణము అమ్మాయి పొట్టిజుట్టుమాట జ్ఞాపకమువచ్చి ఆమె తెచ్చిపెట్టుకుంటున్న ఆనందానికి భంగము కలిగింది అయినా జుట్టుకు నూనెరాసి గట్టిగా బిగించికట్టుతూఉంటే త్వరగా పెరుగుతుందని మనస్సును తృప్తి పరుచుకొన్నది

అపూర్వ ఈవిధముగా పెళ్లి నిశ్చయపరచడముచూచి అంతా దానికి "అపూర్వ నిశ్చయము" అని నామకరణము చేశారు

పిచ్చి మృణ్మయిని ప్రేమించేవాళ్లు చాలా మంది ఉండేవారు కాని ఆమెను కోడలిగా ఇంటికి తెచ్చుకుందామనే కోరికమాత్రము ఎవరికీ లేకపోయింది

మృణ్మయి తండ్రి ఈశాన్ మజుందారికి సమాచారము తెలియచేశారు అతను ఏదో స్టీమరు కంపెనీలో గుమస్తా పనిచేస్తూ దూర దేశములో ఉన్నాడు. నదిఒడ్డున వేసిన ఒక చిరాకేకుల పాక అతని ఆఫీసు స్టీమర్లో సామాను ఎక్కించడము, దింపించ డము, టిక్కెట్లమ్ముతుండడము అతని పని

పెళ్లి ప్రస్తావన వినగానే తండ్రి కళ్ల వెంబడి బొటబొట నీళ్లురాలాయి—అందులో దుఃఖమెంతో నిర్ణయించే ఉపాయములేదు

కుమార్తె వివాహానికి సెలవు ఇప్పించ మని ప్రార్థిస్తూ హెడ్ ఆఫీసుకు దరఖాస్తు పెట్టాడు తండ్రి కాని కంపెనీ పెద్దదొర గారు అది సరిఅయిన కారణముకాదు గనుక సెలవివ్వలేనన్నారు దుర్గపూజ దగ్గిరపడ్డదనీ, పూజాసమయములో వారమురోజులు సెలవు వస్తుందనీ అప్పటివరకు పెళ్లి ఆపుమని ఇంటికి ఉత్తరము వ్రాశాడు. కాని అపూ ర్వుని తల్లి ఈ నెలలో చాలా మంచి ముహూర్తాలున్నవి, ఆలస్యం చేయుటానికి వీలుపడదన్నది ఉభయులలో ఒకరూ తండ్రి ప్రార్థన అంగీకరించలేదు అతడు దుఃఖిస్తూ మామూలుప్రకారము సామాను ఎక్కించిస్తూ టిక్కెట్లమ్ముతూ ఆ టిన్ షాపులోనే ఉండవలసివచ్చింది

అప్పటినుంచి తల్లీ ఊళ్ళో వయస్సు వచ్చిన ఇల్లాల్లూ ప్రతిరోజూ మృణ్మయికి తన కర్తవ్యాన్నిగురించి రోజూ ఉపదేశ మిస్తూవచ్చారు ఆటవరదా, తొందర తొంద రగా నడుస్తుండడము, బిగ్గరగా నవ్వు తుండడము, మొగపిల్లవాళ్లతో ఆడుతూ ఉండడము, ఆకలివేసినప్పుడల్లా భోజనము చేస్తుండడము—అటువంటి సమస్తవిషయా లలో ఏమిచేస్తే తప్పో మృణ్మయికి బోధ పరిచి వివాహము ఎంత భయంకరమైన సంగతో నచ్చచెప్పి కృతార్థులైనారు వివాహ మనగా యావజ్జీవమూ ఖైదు తదనంత రము ఉరిశిక్ష అని మృణ్మయికి బోధపడ్డది

మెడ ప్రక్కకు తిప్పి వెనక్కు నడు స్తున్న పెంకిపోని గుర్రములాగే "నేను పెళ్లి చేసుకోను" అంటూ కూర్చున్నది మృణ్మయి

## 4

అయినా పెళ్లి తప్పిందికాదు.

తరువాత శిక్ష ప్రారంభమయింది

రాత్రికిరాత్రి మృణ్మయి ప్రపంచమంతా అపూర్వుని తల్లి అంతఃపురములోనికి వచ్చి పడింది.

సంశోధనకార్యము ప్రారంభించింది అత్త గారు "చూడు అమ్మాయి నీవు ఇక చంటి పిల్లవుకావు. ఈ ఇంట్లో సిగ్గుమాలిన పను లేమీ చెయ్యడానికి వీలులేదుసుమా!" అని కఠినముగా చెప్పింది అత్తగారు

అత్తగారి మాట బోధపడుచుకోలేదు మృణ్మయి, "ఈ ఇంట్లో వీలులేదు" అంటే ఇంకొకచోటికి వెళ్లి చేసుకోవచ్చునని మృణ్మయి అర్థముచేసుకున్నది ఆనాటి రెండోపూట మృణ్మయి ఇంట్లో కనబడ లేదు ఎక్కడ ఎక్కడ అంటూ నాలుగు చోట్లా వెదికారు చివరకి ఆ విశ్వాసఘాత కుడు, రాఖాల, ఆమె దాగున్నచోటు చూపిం చేశాడు—మరిచెట్టుక్రింద విరిగిపడిఉన్న రాధాకాంత స్వామివారి రథము మీద కూర్చొనిఉన్నది

అత్తగారు, తల్లి, పేటలోని పెద్దవాళ్లు—అంతా కలిసి ఆమెకు ఎట్లాగు చీవాట్లు పెట్టారో పాఠకమహాశయులు సులభముగా ఊహించుకోగలరు

రాత్రి దట్టముగా మేఘము కమ్మి టువ్వ టువ్వుమని చినుకులు ప్రారంభించినవి. అపూర్వ మంచముమీద పడుకొనిఉన్నాడు మెల్లిమెల్లిగా మృణ్మయివైపు జరిగి ఆమె చెవిలో అతిరిపిమాటంతో "నీకు ప్రేమ లేదూ నేనంటే?" అని అడిగాడు

"లేదు, నిన్ను నేను ఎన్నటికీ ప్రేమిం చను" అని తీవ్రస్వరముతో ఆమె జవాబు చెప్పింది అతనిని శిక్షించాలని ఆమె మన స్సులో రవులుకున్న కోరిక, ఆమె కోపమూ పుంజీభూతమై పిడుగువలె అతని నెత్తిమీద పడ్డది

పరాభవము పొంది, బహు నిరుత్సాహ ముగా "ఏమీ నేను చేసిన అపరాధ మేమిటి?" అని అపూర్వ అడిగాడు

"నీవెందుకు నన్ను పెళ్ళాడావు?" అని మృణ్మయి అడిగింది

ఆ అపరాధానికి తృప్తికరమైన సమా ధానము చెప్పడము కష్టము కాని ఏలాగో ఒకలాగు ఎవరికీ లొంగని ఆ పెంకిపిల్ల మనస్సును వశపరుచుకోవాలనే కోరిక కలి గింది అపూర్వకు

ప్రతివిషయములో మృణ్మయి తిరుగు బాటు లక్షణాలు కనబరచడంచూచి అత్త అమ్మగారు ఆమెను గదిలోపెట్టి బయట నుండి గొళ్లెంవేసింది కొత్తగా పంజ రములో పెట్టిన పిట్ట రెక్కలుకొట్టుకుంటూ ఇటూఅటూ ఎగురుతున్నట్టుగా మృణ్మయి గదిలో ఇటూఅటూ తిరగటము మొదలు పెట్టింది కాని పారిపోడానికి దారేదీ కాన రాలేదు విపులక్రోధముకొద్దీ పరుపుమీద నుండే దుప్పటిని పళ్ళతో ముక్కలుముక్క లుగా చీల్చి, నేల పడుకొని నాన్నా నాన్నా అని ఏడవడం ఆరంభించింది

అప్పుడెవరో వెనుకనుంచి మెల్లిగా వచ్చి ఆమెపక్కను కూర్చొని నేలపైన అల్లి ఉన్న ఆమె జుట్టును ముద్దుగా సరిచే ముఖముమీదనుంచి పక్కకు తీయబోయి నారు మృణ్మయి తల అదుపుకొని ఆ

చెయ్యిని తోరుగా అటు తోసేసింది అపూర్వ వంగి ఆమె చెవిదగ్గిర ముఖము పెట్టి నెమ్మదిగా "ఎవ్వరూ చూడకుండా నేను తలుపుతీసుకువచ్చాను త్వరగా లే— ఇద్దరము పారిపోదాము. వెళ్లి చెరువుగట్టు మీద ఆడుకొందాము" అని అన్నాడు మృణ్మయి వడిగా కలతపడి ఏడుస్తూ "నేను రాను" అని జవాబు చెప్పింది అపూర్వ ఆమె గడ్డముకింద చెయ్యిపెట్టి ఆమె ముఖాన్ని ఎత్తప్రయత్నముచేస్తూ "చూడు ఒక్కమారు ఎవరు వచ్చారో" అని అన్నాడు

నేల పడుకొనివున్న మృణ్మయివైపు మతిపోయినవానిలాగు చూస్తూ రాఖాల్ ద్వారముదగ్గిర నిలుచున్నాడు మృణ్మయి అటువైపు ముఖమైనా తిప్పకుండా అపూర్వ చెయ్యి అటు తోసేసింది "రాఖాల్ నీతో ఆడుకుందామని వచ్చాడు ఆడుకోడానికి వెళ్ళవూ?" అని మళ్ళా అడిగాడు అపూర్వ "వెళ్లను" అని చీకాకుపడుతూ జవాబు చెప్పింది మృణ్మయి సంగతి బాగులేదని కనిపెట్టి రాఖాల్ అక్కడనుంచి మెల్లిగా పారిపోయి బ్రతికాను అనుకున్నాడు అపూర్వ అక్కడే కూర్చున్నాడు నోరు విప్పకుండా మృణ్మయి ఏడ్చి ఏడ్చి అలిసి నిద్రపోయింది అపూర్వ లేచి చప్పుడు చేయకుండా బయటికివచ్చి తలుపు గొళ్లెము పెట్టి వెళ్లిపోయినాడు

ఆ మర్నాడు మృణ్మయికి తండ్రిదగ్గిర నుంచి ఉత్తరం వచ్చింది తనకు ప్రాణతుల్యమైన మృణ్మయి పెళ్లికి రాలేకపోయినందుకు మిక్కిలి దుఃఖించి హృదయపూర్వకాశీర్వాదాలు దంపతులకు ఉత్తరము ద్వారా పంపాడు కోడలియొక్క బుద్ధి మాలిన కోరికలనుచూచి—అత్తగారు చీవాట్లుపెట్టింది "నాన్న ఎక్కడ ఉన్నాడో తెలియదు నాన్నదగ్గిరికి వెళ్లుతుందట— ఏమిటి ఈ ముద్దు ఎక్కడా లేనిది?' అని అన్నది అత్తగారు మృణ్మయి జవాబు చెప్పలేదు గదిలోకి వెళ్లిపోయి తలుపుల మూసుకొని కేవలము దిక్కులేనివాళ్ళు దేవుని ప్రార్థించినట్టుగా ప్రార్థించసాగింది— "నాన్నా నీవు వచ్చి నన్ను తీసుకువెళ్లిపో ఇక్కడ నాకెవ్వరూ లేరు ఇక్కడఉంటే నేను మరి బ్రతకను"

అర్ధరాత్రప్పుడు భర్త నిద్రపోతుండగా మెల్లిగాలేచి మృణ్మయి గదిలోనుంచి బయటికి వచ్చేసింది మేఘము ఉన్నప్పటికీ మధ్యమధ్య వెన్నెలగా ఉండడముచేత దారి కనబడుతున్నది నాన్నదగ్గిరికి వెళ్ళాలంటే ఏ దారిని వెళ్లాలో మృణ్మయి ఎరగదు పోస్టాఫీసు "రన్నర్లు" ఉత్తరాల సంచులు పట్టుకువెళ్ళే దారిని వెళ్లితే ప్రపంచములో ఏచోటికైనా వెళ్లిపోవచ్చునని ఆమె నమ్మకము మృణ్మయి ఆ పోస్టుదారిని బయలుదేరింది నడుస్తూ వెళ్లివెళ్లి బాగా అలసిపోయింది అప్పటికి రాత్రి అంతముకావచ్చిందికూడాను అడివి మధ్యను అక్కడక్కడ చెట్లమీద పక్షులు కదులుతున్నవి కాని ఎంతవేళ అయివుంటుందో మృణ్మయి సరిగా నిర్ణయించలేక మనస్సులో కొంచెము కంగారుపడుతున్నది ఆ దారి చివరను సంతకూడే స్థలములాంటి పెద్ద జాగ్యా ఒకటి నదిఒడ్డున కనబడ్డది మృణ్మయి అక్కడికి వచ్చి నిలబడి ఆలోచిస్తున్నది ఇప్పుడేమి చెయ్యడము అని అంతలో రోజూ తాను వింటూఉండే పోస్టు రన్నర్ ఘల్లుఘల్లు శబ్దము వినబడ్డది ఉత్తరాలసంచి కావిడ భుజముమీద పెట్టుకొని అలసటగా ఊపిరి తీస్తూన్న రన్నర్ కనబడగానే ఆమె వాని దగ్గిరికివచ్చి క్షీణకంఠముతో "నన్ను కాళీగంజ్ మా నాన్నదగ్గిరికి తీసుకువెళ్లవూ?" అని అడిగింది "కాళీగంజ్ ఎక్కడో నాకు తెలియదు" అని రన్నర్ జవాబుచెపుతూ రేవుదాటించే బోయవాణ్ణి లేపి ఉత్తరాల సంచి పట్టుకొని బల్లకట్టు ఎక్కి వెళ్లిపోయినాడు దయచూపడానికిగాని ప్రశ్నించడానికిగాని వాడికి వ్యవధిలేదు

ప్రొద్దెక్కుతున్నది రేవు సంత మనుష్యులతో నిండుతున్నది మృణ్మయి రేవులోకివచ్చి, "నన్ను కాళీగంజ్ తీసుకువెళ్ళతావా పడవవాడా?" అని ఒక పడవవాణ్ణి అడిగింది వాడు జవాబు చెప్పకముందే పక్కపడవవాడు "ఓహో ఎవరది "మినుఅమ్మా" నీవు ఇక్కడికి ఏలాగు వచ్చావు అమ్మా?" అని అడిగాడు మృణ్మయి బహుఉత్సాహముతో "వనమాలీ, నేను నాన్నదగ్గిరికి వెళ్ళుతాను కాళీగంజ్. నీపడ


మీ నాటకాలకు రికార్డులకు, ప్లేబ్యాక్ సాంగ్సుకు డ్యాన్సు ప్రక్కవాయిద్యాలకు, హరికథ సంగీత కాలక్షేపాలకు

మరి కలవండి

★

శ్రీ బి. ఎం జె. ధైర్యం

(సంగీత దర్శకుడు)

15 రకాల వాయిద్యాల సంగీతం నాట్యముల నేర్పబడును

సౌ. మ్యూజికల్ ఎకాడమీ

38 వల్లప్పవాత్తియార్ వీధి

మదరాసు-21



వలో నన్ను తీసుకువెళ్ళు." అని అన్నది వనమాలి తమగ్రామమువారు, ఎవరిమాటా లక్ష్యపెట్టని ఈ అమ్మాయిసంగతి వారు బాగా ఎరుగుదురు "నాన్నదగ్గిరికి వెళ్ళుతావా? మంచిమాటే, తీసుకువెళ్ళుతాన్లేరా అమ్మా" అని వారన్నారు, మృణ్మయి పడవఎక్కింది

పడవవారు పడవ వదిలారు ధారా వర్షము ప్రారంభమయింది భాద్రపద మాసము గట్లుతీసిపారుతున్న ఏందుప్రవాహములో నావ ఊగుతూ వెళ్ళుతున్నది మృణ్మయి అలిసిఉన్నది నిద్రకి కళ్లు మూతలుపడుతున్నవి పైటచెంగు కింద పరుచుకొని పడుకున్నది ప్రకృతి ప్రేమతో పెంచుతున్న శాంతశిశువువలె నదీజలములో ఉయ్యాలలాడుతున్న ఆ నావలో ఆమె నిశ్చింతగా నిద్రించసాగింది

తెలివివచ్చి చూచేసరికి తాను అత్తవారి ఇంట్లో మంచముమీద పడుకొనిఉన్నది ఆమెను తెలివిరాగానే దాసీది దగ్గరికి వచ్చి ఆమెను చీవాట్లుపెట్టింది దాని గొంతుకవిని అత్తగారువచ్చి చాలా కఠినముగా మాట్లాడడము ఆరంభించింది మృణ్మయి కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యపోతూ అత్తగారివైపు చూచింది ఆఖరికి తండ్రివల్ల తాముపొందిన తిరస్కారమును సూచిస్తూ అత్తగారు అతన్ని దూషించడము మొదలుపెట్టగానే మృణ్మయి గదిలోకి వెళ్లిపోయి లోపలనుంచి గడియ వేసుకున్నది

అపూర్వ సిగ్గు భరించలేక తల్లిదగ్గరికి వచ్చి, "పిల్లను నాలుగురోజులపాటు పుట్టింటికి పంపితే తప్పేమిటి?" అని అన్నాడు

ముందూ వెనకా చూడకోక దేశము నిండా ఇంతమంది పిల్లలు ఉంటూఉంటే ఏంచి ఏంచి ఇలాంటి పిల్లని పెళ్లిచేసుకున్నందుకు తల్లి అపూర్వను బాగా తిట్టింది— "కాల్చుకు తినేస్తుంది ఎక్కడి దొంగపిల్ల అమ్మా!" అని అరటూ విసుగుకొన్నది

## 5

ఆవేళ రోజల్లా బయట గాలివాన ఇంటి లోపలకూడా అలాగే తుపాను

ఆ మర్నాడు మృణ్మయి నిద్రపోతుంటే మెల్లిగా లేపి అపూర్వ "మృణ్మయీ మీనాన్నగారిదగ్గిరికి వెళ్లతావా?" అని అడిగాడు

మృణ్మయి ఉలికిపడిలేచి భర్తచెయ్యి గట్టిగా పట్టుకొని ఉత్సాహంతో "వెళ్లతాను" అని అన్నది

"అయితే పద, మనము ఇద్దరము వెళ్ళిపోదాము పడవ కుదిర్చి రేవులో ఉంచాను" అని అపూర్వ మెల్లిగా ఆమె చెవిలో అన్నాడు

మృణ్మయి కృతజ్ఞతతో భర్తవైపు ఒక్కమారు చూచి తొందర తొందరగా లేచి వచ్చి వెళ్ళడానికి సిద్ధమవుతుంది తల్లి భయపడకుండా ఉత్తర మొకటి వ్రాసి పెట్టాడు అపూర్వ ఇద్దరూ బయలుదేరారు

మృణ్మయి ఆ చీకటిరాత్రిని ఆ జనశూన్యమైన నిశ్శబ్ద గ్రామపథములో ఇచ్ఛాపూర్వకంగా ధైర్యముతో భర్తచెయ్యి పట్టుకొని నడవడము ఇదే మొదటిసారి మృణ్మయి హృదయములో పుట్టుతున్న ఆనందము ఆమె కోమల హస్తస్పర్శద్వారా భర్త రక్తశిరాలలోకి వెళ్లుతున్నది

వాళ్లు ఎక్కగానే పడవ బయలుదేరింది పట్టరాని ఆనందముగాఉన్నా మృణ్మయికి అతిత్వరలో నిద్రపట్టిపోయింది ఆ మర్నాడు ఏమి ఆనందము! రెండుపక్కలా ఎన్ని గ్రామాలు ఎన్ని దుకాణాలు, వరిచేనులు తోటలు, రెండుపక్కలా ఇటునుంచీ అటునుంచీ ఎన్ని నావలు వచ్చిపోతున్నవి ప్రతి చిన్న విషయాన్ని గురించీ వేయిప్రశ్నలు వేస్తున్నది మృణ్మయి—"ఆ పడవలో ఏమి ఉన్నది? వాళ్లు ఎక్కడనుంచి వస్తున్నారు? ఈ ఊరి పేరేమిటి?"— ఇటువంటి లెక్కలేని ప్రశ్నలు—వాటి జవాబులు అపూర్వ కాలేజీలో చదివిన ఏ పుస్తకాలలోనూ లేవు కలకత్తాలో అతను సంపాదించిన అనుభవమువల్లకూడా జవాబు చెప్పే శక్తి అతనికి లేకపోయింది మిత్రులు విని సిగ్గుపడతారుగాని ఆమె అడిగిన ప్రతి ప్రశ్నకూ అపూర్వ జవాబు చెప్పాడు కాని ఆ జవాబులకూ నిజానికీ ఎటువంటి సంబంధమూ లేదు—నువ్వులతోనిండిఉన్న నావ వెళ్లుతూఉంటే చూచి దానిని నారదేళ్ల పడవ అని అనడానికి సంకోచించేవాడుకాడు పాంచ్‌బేడా గ్రామము పేరు రాయ్‌నగర్ అయిపోయేది మున్సిఫ్ కోర్టును చూచి జమీందారుగారి కచేరి అనేవాడు ఎటువంటి తప్పు జబాబు చెప్పినప్పటికీ మృణ్మయి అమాయకముగా నమ్మేది దానివల్ల ఆమెకు కలగవలసిన ఆనందము లేశమైనా తగ్గలేదు

పడవ మర్నాడు సాయంకాలము కాశీగంజ్ వచ్చిచేరింది టిన్ రేకుల గుడిసెలో నాలుగు పలకల లాంతర్లో చిన్న కిరసనాయిలు బుడ్డి వెలుగుతున్నది చిన్న టేబిలుమీద చర్మము బైండు పెద్ద చిట్టా ఒకటి పెట్టుకొని ఒంటిమీద బట్ట తోసేసి కూర్చొని ఈశాన్‌చంద్ర జమాఖర్చులు వ్రాస్తున్నాడు ఆ సమయములో నవదంపతులు ఆ కుటీరములో ప్రవేశించారు మృణ్మయి "నాన్నా" అని అన్నది ఇటువంటి కంఠస్వరమూ ఇటువంటి పిలుపు ఈ కుటీరములో ఇంతకుపూర్వ మెన్నడూ వినబడలేదు ఈశాన్ కళ్ళవెంబడి బొటబొట నీళ్లు కారిపోయినవి ఏమి చెయ్యాలో ఏమి అనాలో అతని తోచలేదు రాజ్యానికి యువరాజూ యువరాజ్ఞీ వచ్చారు—వాళ్ళకు తగిన సింహాసనము ఈ నారకట్టలమధ్యను ఎట్లాగు నిర్మించడమో తెలియక మతిపోయి నట్టుగా చూస్తున్నాడు ఈశాన్‌బాబు

ఆటుపిమ్మట చేయవలసినది భోజనం ఏర్పాట్లు—అదీ ఆలోచించవలసిన విషయమే! బహుపేదవాడు, చిన్నగుమాస్తా

పనిలో ఉన్నారు తనకు కావలసిన పన్నూ అన్నమూ తానే వండుకొని కాలక్షేపము చేస్తున్నారు ఈ శుభదినమునాడు ఏమి చేయగలరు ఏమిటి వండిపెట్టగలరు—"ఏమీ తోచలేదు అంతలో మృణ్మయి తండ్రిదగ్గిరికివచ్చి, ఇవాళ మనముగ్గురము కలిసి వండుదాము నాన్నా" అని అన్నది. అపూర్వకూడా అతిఉత్సాహముతో "వండుదాము" అన్నారు

ఇంట్లో జాగాలేదు చేసేవాళ్ళు లేరు. ఆహారపదార్థాలు లేవు అయినా రంధ్రము చిన్నదైనకొలందీ ఊట మరీ జోరుతో తన్నుకువచ్చినట్టుగా ఆ పేదతండ్రి హృదయములో పుట్టుతున్న ఆనందము నాలుగింతలై అతని ముఖములో కనబడుతున్నది

ఈ విధముగా మూడు రోజులు గడిచాయి స్టీమరు రెండు పూటలా వచ్చి నిలిచేది—మనుష్యులు ఎక్కడము దిగడము ఎంతో సందడిగా ఉండేది సాయంకాలము ఏమీ సందడి ఉండేదికాదు,—నిశ్శబ్దము నిర్జనము—పరిపూర్ణ స్వేచ్ఛ! ముగ్గురూ కలిసి ఇదీఅదీ జాగ్రత్తపెట్టేవారు వంటకు తప్పులు చేస్తుండేవారు ఒకటి చేయబోతే ఇంకొకటి అయేది వంట కాగానే చేతిగాజులు గలగల్లాడిస్తూ మృణ్మయి మామాఅల్లుళ్ళకు వడ్డించేది ఆమె చేతకాని తనముచూచి వాళ్ళు ఎగతాళిచేసేవారు తరువాత ఆనందకలహాలు జరిగేవి మృణ్మయి కోపమువచ్చినట్టు నటిస్తుండేది చివరకు ఇక అట్టే రోజులు అక్కడ ఉండడము న్యాయముకాదని అపూర్వ అన్నాడు మరి నాలుగు రోజులు ఉందామని అతిదీనముగా ప్రార్థించింది మృణ్మయి వెళ్ళడమే మంచిదని ఈశాన్‌బాబు అన్నాడు

వెళ్ళిపోతున్ననాడు తండ్రి కళ్ళనీళ్ళు పెట్టుకొని గద్గదస్వరంతో కుమార్తెను దీవించాడు—"లక్ష్మీదేవివై అత్తవారి ఇంటిని ఉజ్జ్వలముచెయ్యి అమ్మా. నాతల్లి మనసు ఎవ్వరూ ఎటువంటి తప్పు పట్టకూడదు!"

మృణ్మయి ఏడుస్తూ నాన్నదగ్గిర సెలవు పుచ్చుకొన్నది వాళ్ళు వెళ్ళిపోయినప్పటి తండ్రి నిరానందము రెండింతలయింది. మామూలుప్రకారము సరకు తూపిస్తూ లెక్కలు వ్రాసుకొంటూ కాలముగడుపుతున్నారు.

## 6

ఆ అపరాధద్వయము ఇంటికి తిరిగి వచ్చారు అపూర్వతల్లి నోరుతెరవక, గంభీరముగా కూర్చున్నది ఆమె ఏదైనా దోషారోపణచేసిఉంటే క్షమార్పణ ప్రయత్నానికి అవకాశము చిక్కిఉండును తల్లివైపు నుండి తల్లిచేసే అన్యాయం మాట్లాడకుండా సహించిఉండడమూ—ఈరెండూ ఆ ఇంటి గుండెమీద కూర్చొనిఉన్న పెద్ద ఇసుక గుండు అయి ఉండెను

చివరకు అది భరించ శక్యముకాదని తోచి అపూర్వ ఒకనాడు తల్లిదగ్గిరికివచ్చి, "కాలేజి తెరిచారమ్మా నేను "లా" చదువుకోడానికి కలకత్తా వెళ్ళాలి" అని అన్నాడు

"కోడలిని ఏమిచేస్తావు?" అని అడిగింది అమ్మ అతినిరుత్సాహముగా

"ఇక్కడే ఉంటుంది" అని అన్నాడు అపూర్వ

"ఇక్కడ అవసరము లేదోయి నీతోనే తీసుకొనివెళ్ళు" అని అన్నది—తల్లి ఇంతకు పూర్వము ఎప్పుడూ "ఓయి" అనలేదు. కుమారుణ్ణి సంబోధిస్తూ

అపూర్వ దుఃఖిస్తూ, "సరే" అన్నాడు, రోషముకొంది

కలకత్తాకి వెళ్ళే ఏర్పాట్లు జరుగుతున్నవి మర్నాడు ప్రయాణము ముందు రాత్రి అపూర్వ పడుకోడానికి వచ్చేసరికి మృణ్మయి మంచముమీద పడుకొని ఏడుస్తున్నది

"మనస్సుకు బాధకలిగి, "నాతో కలకత్తా రావాలని నీకులేదా?" అని అపూర్వ హఠాత్తుగా అడిగాడు.

"లేదు" అన్నది మృణ్మయి

"నామీద నీకు ప్రేమలేదా?" అని అపూర్వ అడిగాడు—మృణ్మయి ఏమీ జవాబియ్యలేదు ఇటువంటి ప్రశ్నకు జవాబు ఒకొకమారు అతిసులభము కాని మనస్సు యొక్క తత్వమపారము హృదయములోని అనేక జటిలభావాలతో చిక్కుపడి ఉండబట్టి బాలికదగ్గిరనుండి ఆ ప్రశ్నకు సాధారణముగా ఆశించకూడదు

"రాఖాల్‌ని విడిచిపెట్టి వెళ్ళడమంటే నీకు కష్టముగా ఉన్నదికదూ?" అని అపూర్వ అడిగాడు.

"ఔను," అన్నది మృణ్మయి, సునాయాసముగా

బి ఏ పాస్‌అయిన ఆ విద్వాంసుని మనస్సులో ఆ కుర్రవాడు—రాఖాల్‌పై ఈర్ష్య కలిగింది అతిసూక్ష్మమైనప్పటికీ పొడవైనటువంటి సూదితో పొడిచినట్టు బాధచెంది అపూర్వ మృణ్మయితో "నేను చాలారోజులవరకు ఇంటికి తిరిగిరాలేను," అని అన్నాడు ఈ ప్రస్తావము విని మృణ్మయి ఏమీ అనకపోవడముచూచి, "బహుశా రెండేళ్ళవరకు రాలేను అంతకంటె అలస్యముకూడా కావచ్చును." అని అపూర్వ తిరిగి అన్నాడు,

"నీవు వచ్చేటప్పుడు మూడు బ్లేడ్లు, రాజర్సు కత్తి మంచిదొకటి రాఖాల్‌కోసము తీసుకురా" అని మృణ్మయి అన్నది

అపూర్వ పడుకొనిఉన్నవాడు లేచి, "అట్లాగైతే నీవు ఇక్కడే ఉంటావా?" అని అడిగాడు

"ఆహా, అమ్మదగ్గిరికి వెళ్లి ఉంటాను" అని అన్నది మృణ్మయి

కి స్నె ర

నిట్టూర్పు విడిచి అపూర్వ అన్నాడు— "సరే అయితే ఉండు। నన్ను రమ్మని నీవు ఉత్తరము వ్రాసేవరకు నేను రాను—నీకది సంతోషమేనా ?"

ఈ ప్రశ్నకు జవాబు అవసరమని తోచక మృణ్మయి నిద్రపోయింది కాని అపూర్వకు నిద్రపట్టలేదు కాలేజు మీదికిలాగి చేరబడి కూర్చున్నాడు

బాగా రాత్రి అయింది, హఠాత్తుగా చంద్రు డుదయించాడు వెన్నెల మంచము మీద పడుతున్నది వెన్నెల వెలుగులో అపూర్వ మృణ్మయి ముఖము వైపు చూచాడు చూడగా చూడగా వెండి మంత్ర దండం స్పర్శద్వారా రాజకన్య నెవరైనా చైతన్యములేకుండా చేశారా అన్నట్టు అపూర్వకు తట్టింది ఇప్పుడు సువర్ణ మంత్ర దండము దొరికితే ఆ నిద్రిస్తున్న ఆత్మకు తెలివితెప్పించి వధూవరులచేత పూలహారాలు మార్పించవచ్చునని అతనికి తోచింది

తెల్లవారింది అపూర్వ మృణ్మయిని లేపి, "మృణ్మయీ నేను వెళ్ళే వేళఅయింది మీ అమ్మగారి ఇంట నిన్ను దిగబెట్టిపోతాను పద," అని అన్నాడు

మృణ్మయి లేచి నిలబడగానే అపూర్వ ఆమె చేతులు రెండూ పట్టుకొని "నా ప్రార్థన ఒకటి ఉన్నది నీకు నేను అనేక సార్లు సాయముచేశాను వాటి అన్నిటికి బదులు నీవు నాకొక బహుమానము ఇవ్వాలి," అని అన్నాడు

"ఏమిటి అది ?" అని ఆశ్చర్యపడుతూ అడిగింది మృణ్మయి

"నీవు ప్రేమతో ఇచ్ఛాపూర్వకముగా నన్నొకమారు ముద్దుపెట్టుకోవాలి"

అపూర్వ గంభీరముగా ఇటువంటి అద్భుత ప్రార్థన చేయడము చూడగానే మృణ్మయికి నవ్వువచ్చింది. నవ్వాపుకొని ముద్దుపెట్టుకుందామని ముఖమెత్తింది కాని ముఖముదగ్గిరికి రాగానే మరి ఆ నవ్వాపుకోలేక పకపక నవ్వడ మారంభించింది రెండుమార్లీ విధముగా ప్రయత్నించి మరి లాభములేదనుకొని చీరచెంగుతో నోరు మూసుకొని తిరిగి నవ్వడము మొదలు పెట్టింది దండిస్తున్నట్టు నటిస్తూ అపూర్వ ఆమె చెవులుపట్టి ఆడించాడు

అపూర్వుని శపథము బహుకఠినమైనది దొంగతనముగాగాని బలవంతానగాని దేనినైనా సంపాదించడము ఆత్మగౌరవానికి హానికరమని అతని మతము దేవతవలె మర్యాదగా కూర్చొని ఇచ్ఛాపూర్వకముగా ఇచ్చిన ఉపహారముతప్ప బలవంతంగా తీసుకోవడము అక్కరలే దతనికి తన చేతితో కానేదీ తీసుకోరు

మృణ్మయి మరి నవ్వలేదు తెలతెల్ల వారుజామున వీధులు ఇంకా నిర్జనంగా ఉండేవేళను మృణ్మయిని అమ్మగారి ఇంటి దగ్గిర విడిచిపెట్టివచ్చి అపూర్వ అమ్మతో ఇట్లాగన్నాడు—"బాగా ఆలోచించి చూచానమ్మా మృణ్మయిని నాతో కలకత్తా తీసుకొని వెళ్ళానంటే నా చదువుకు అడ్డు వస్తుంటుంది ఆమెకుకూడా ఇక్కడ ఎవరూ ఉండరు నీవు ఇక్కడ ఉంచుకోనన్నావు అందుకని వాళ్ల అమ్మగారి ఇంట్లో విడిచి పెట్టివచ్చాను"

తల్లీకొడుకు లెడబాటు ఇటువంటి పరిస్థితులలో జరిగింది

## 7

పుట్టింటికి వచ్చి చూచింది మృణ్మయి—ఆమె మనస్సు బాగుండలేదు—ఆమూలాగ్రము ఇల్లు మారిపోయింది అనిపించింది ఊసుపోవడములేదు ఏమి చెయ్యదమో, ఎక్కడికి వెళ్లదమో ఎవరిని చూడదమో, ఏమి మాట్లాడదమో—ఏమీ ఆమెకు తోచలేదు

ఆ ఇంట్లోగాని, ఆ గ్రామములోగాని ఎవ్వరూ లేరనిపించింది ఆమెకు సూర్యగ్రహణము పట్టినట్టుగా మిట్టమధ్యాహ్నము చీకటిఅయినట్లు తోచింది కలకత్తా వెళ్లదామని పిచ్చికోరిక పుట్టింది ఇవాళ ఈ కోరిక ఎక్కడ ఉండెనో ? నేటివరకు ఆహ్లాదకరముగా ఉన్న జీవితములోని రుచి మారిపోతుందని ఆమె ఊహించుకోలేకపోయింది కాడ ఎండి రాలిపోయిన ఎండుటాకువలె తన అతీతజీవితాన్ని అనాయాసముగా దూరముగా పారేసింది

నేర్పరులైన నిర్మాతలు బహుసూక్ష్మమైనటువంటిన్నీ మిక్కిలి వాడైనటువంటివిన్నీ కత్తులు చేయగలరని మనము వింటున్నాము వాటితో మనను రెండుగా కోస్తూంటే మనకేమీ తెలియనే తెలియదట అంతా అయిపోయినతరువాత చివరకు కదిపేసరికి మనము రెండుముక్కలయి పడిపోతామట। భగవంతుని చేతిలోనున్న శస్త్రముకూడా అటువంటి సూక్ష్మమైనదే అతను మృణ్మయి బాల్యజీవితాంశానికీ యౌవనాంశానికీ మధ్యనుండి ఎప్పుడు కత్తిని నడిపించాడో మృణ్మయికి తెలియనేలేదు నేడు ఎట్లాగో కొంచెము కదలగానే బాల్యాంశమూ యౌవనాంశమూ వేరైపోయినవి మృణ్మయి ఆశ్చర్యపోయి చూస్తూ నిలబడ్డది

పుట్టింటనుండే తన పడకగది మునపటి తన గది అని ఆమెకు ఇప్పుడు తోచలేదు పూర్వము ఆ గదిలో ఉండేది ఇప్పు డక్కడ లేదని ఆమెకు అనిపించింది ఆమె హృదయము తన సమస్తస్మృతితోకూడా ఇప్పుడు మరిఒక ఇంట్లో మరిఒక గదిలో మరిఒక మంచముమీద—ఈలాగు ఏమేమో తనలో తాననుకొంటూ తిరుగుతున్నది

మృణ్మయి ఇప్పుడు బయట ఎవ్వరికీ కనబడడములేదు ఆమె నవ్వు కూడా ఎక్కడా వినబడడములేదు రాఖాల్ కి ఆమెను చూస్తే భయమువేస్తున్నది ఆమెతో ఆడుకుందామనే తలపే అతనిలోకి రాకుండా ఉన్నది

"నన్ను అత్తవారింట్లో దిగబెట్టేసిరా అమ్మా' అని మృణ్మయి తల్లితో అన్నది

దుఃఖిస్తూ కుమారుని ముఖము జ్ఞాపకమువచ్చి అపూర్వతల్లికి గుండె బద్దలైపోతున్నది కోపముకొద్దీ కోడల్ని పుట్టింటికి దిగబెట్టిరమ్మన్నందుకు ఆమెకు దుఃఖము కలుగుతున్నది

అంతలో ఒకనాడు తలమీద ముసుగు వేసికొని వాడినముఖముతో మృణ్మయివచ్చి అత్తగారి కాళ్లకు ప్రణామముచేసింది అత్తగారు కళ్లనీళ్లు పెట్టుకొని కోడలిని లేవదీసి గుండెలకు కౌగలించుకున్నది రెప్పపాటులో ఇద్దరి హృదయాలూ కలిసిపోయినవి కోడలి ముఖము చూచి అత్తగారు ఆశ్చర్యపోయింది ఈమె మునపటి మృణ్మయికాదని ఆమెకు తోచింది ఇటువంటి మార్పు ఎప్పుడోగాని సంభవించదు అట్టి మార్పులకు గొప్పబలము వస్తుంది

మృణ్మయి దోషాలను ఒక్కొక్కటిగా సరిచేయాలని అత్తగారు సంకల్పించుకొంటుండెను కాని ఆలాచేయడము అవసరములేకుండానే సంశోధనకర్త ఒకడు కనబడకుండానే మృణ్మయికి ఒక క్రొత్త జన్మను ఇచ్చాడు

మృణ్మయి అత్తగారిని ఇప్పుడు బోధపరుచుకున్నది అత్తగారు మృణ్మయిని పోల్చుకున్నది చెట్టుకి దాని శాఖోపశాఖలతో ... ఐక్యము ... ఇప్పుడు ఆ ఇంట ఏర్పడింది

ప్రేమపూరితమైన ... లోపలా మూలమూలలనూ మృణ్మయిలో పుట్టి ఒకవిధమైన వేదనను ... సాగింది ఆషాఢ ప్రారంభములో ఆకాశవ ఆక్రమించిన నల్లని ... మేఘాలవలె ... మృణ్మయి ... హృదయాన్నీ ఆవరించింది ... మృణ్మయి కనురెప్పల ... ఇది మరింత గాఢముచేసింది మృణ్మయి ... తో అంటున్నట్లు ... దెను "నన్ను నేను ... నాను ... చుకోలేదు? ... మన్నించి ... తప్పచెప్పావు కావెందుకు? నీ ఇష్టప్రకారము నాచేత ఎందుకు చేయించలేదు? ... నీతో కలకత్తా ... నన్ను తీసుకువెళ్ళలేదేమి? నీవు నామాట ఎందుకు విన్నావు? నా కోరికప్రకారము చేశావెందుకు? నా తిరుగుబాటు చూచి సహించి ఊరుకున్నావేమి?'

తరువాత ఒకనాటి ఉదయము కొలను ... విస్తసమార్గంలో ఆమె అతనికి దొంగవలె దొరికిపోయింది అప్పుడు ... అతడు ఆమెను ఏమీచెయ్యలేదు, ఏమీఅనలేదు ఆమె ముఖమువంక కొంచెముసేపు చూచి వదిలిపెట్టేశాడు ఆ కొలను ఆ దారి ఆ చెట్లనీడ ఆ ప్రాతఃకాలపు ఎండ, హృదయభారముతో వాలుతున్న ఆ గభీర దృష్టి—అవన్నీ నేడు ఆమెకు తిరిగి స్పష్టముగా కనపడుతున్నవి వాటి అర్థము మృణ్మయికి నేడు బోధపడుతున్నది ... —వెళ్లిపోతున్నప్పుడు అపూర్వ ఒక్క ముద్దు ఇమ్మని ఆమెను కోరాడు ఆమె ... పెట్టుకోబోయింది ముద్దు అతని ముఖముపైపు వెళ్లి తిరిగివచ్చేసింది ఆ అసంపూర్ణచుంబనము మరీచికముపైపు పరుగెత్తుతున్న పక్షివలె నేడు ఆ గతించిన ... రాత్రిముపైపు పరుగెత్తుతున్నది నేడు ఆ దాహముతీరే ఉపాయములేదు "ఆ ప్రశ్నకు ఈ జవాబు చెప్పిఉండవలసి ఉండెనని అటువంటిఅప్పుడు ఇట్లా చేసి ఉండవలసిఉండె"నని—అని అనుకొంటూ ఇప్పుడు విచారిస్తూ కూర్చున్నది

మృణ్మయి తనను బోధపరుచుకోలేదని అపూర్వకు నేడు ఎంత దుఃఖముగాఉన్నదో, తననుగురించి ఏమి అనుకొన్నాడో, ఏమి బోధపరుచుకున్నాడో అని ఆలోచిస్తూ కూర్చున్నది మృణ్మయి తాను ఎవ్వరికీ లొంగని చపలచిత్తురాలైన అవివేకబాలిక అని అపూర్వ అనుకొన్నాడు కాబోలు అతని ప్రేమపిపాసను పూర్ణహృదయామృతధారలతో తీర్చగలశక్తి తనలో ఉన్నదని అతను ఎరుగడు అది గ్రహించనందుచేత నేడు ఆమె హృదయము పరితాపముతోమూ ఎగ్గుతోను నిండుతున్నది. అపూర్వకు ఇయ్యా


# బహిష్టు ఆగినదా?

"దేవీ మాత్రలు" (Registered by the Central Drug ... of India under No CDL/688) ఏ కారణమువల్లనైనను ... ఆగిన బహిష్టును ... వెంటనే జారీచేయును ... ప్రశంసాపత్రములు ... దివ్యఔషధము నకిలి మందులను వాడి మోసపోకుడు ... (Ordinary) రు 8-8 0 (Special) కొన్నినెలలుగా ఆగిన ... 10-8 0 ... ప్రత్యేకము

# గర్భనిరోధం

... Regd No 260 ... 12 రోజులు ... 6 ... లకు గర్భముకలుగదు బహిష్టు మామూలుగా ... ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల ఔషధము ... రు 12 0 0 ... ప్రత్యేకము

SEENU & CO PB 1638( )MADRAS-1




కి వ్నె శ

వలసిన ముద్దూ ఆదరాన్నీ అతని తలగడకు సమర్పిస్తూ అప్పుతీర్చుకోవలెనని ప్రయత్నించింది ఈవిధంగా కొద్దిరోజులు గడచినవి

"నన్ను రమ్మని నీవు వ్రాసేవరకు నేను ఇంటికి రాను,' అని అపూర్వ చెప్పి వెళ్లాడు అది జ్ఞాపకమువచ్చి మృణ్మయి ఒకనాడు గదితలుపులు బిడాయించి ఉత్తరము వ్రాదామని కూర్చున్నది అపూర్వ ఇచ్చిన బంగారపు అంచుదిద్దిన లెటరు పేపర్లు బయటికితీసి ఉత్తరము వ్రాదామని ఆలోచించడము మొదలుపెట్టింది వ్రాత ఆరంభమయింది అతిజాగ్రత్తగా కలము పట్టుకొన్నది పంక్తి వంకర అయిపోతున్నది అక్షరాలు పెద్దా చిన్నా అవుతున్నవి వ్రేళ్లకు సిరా అంటుకొంటున్నది—ఉత్తరమ ఏమని సంబోధించాలో తెలియదు—ప్రారంభించింది—"నీవు నాపేర ఉత్తరాలు వ్రాయవేమి? నీవు ఎట్లాగు ఉన్నావు? నీవు ఇంటికి రావలెను" ఇంకేమి వ్రాయవలెనో తెలియలేదు వ్రాయవలసిన ముఖ్యవిషయము అయిపోయింది నిజమే కాని మరికొంత పెంచి వ్రాస్తేనేగాని మనస్సులోని కోరిక ఇతరులు పోల్చుకోలేరు అనుమాట మృణ్మయికికూడా తెలుసును కనుక చాలాసేపు ఆలోచించి ఆలోచించి మరికొన్ని మాటలు ఆ ఉత్తరములో కలిపింది "ఉత్తరము ఇప్పుడు నీవు వ్రాయవలెను నీ క్షేమసమాచారము తెలియచేయి నీవిక ఇంటికిరా అత్తయ్య కులాసాగా ఉన్నారు "విశు" "పుటి" క్షేమంగా ఉన్నారు మన నల్ల ఆవు నిన్నను ఈనింది" ఇంతటితో ఉత్తరము ముగించింది ఉత్తరము కవరులో పెట్టింది కవరు అంటించి పైవిలాసము వ్రాసింది ప్రతిఅక్షరముమీద అతిఆదరముతో ఒక్కొక్క చుక్క పెట్టుతూ "అపూర్వకృష్ణరాయ్" అని విలాసము వ్రాసింది ప్రేమ మనస్సునిండా ఉండెను కాని పంక్తి తిన్నగా రాలేదు అక్షరాలు కుదురుగా రాలేదు వర్ణక్రమము కూడా సరిగాలేదు

కవరుపైని పేరు కాక ఇంకేమైనా వ్రాయడం అవసరమని మృణ్మయి ఎరగదు ఆ గారి కంటగాని ఇంకెవరి కంటగాని పడవచ్చునని సిగ్గుపడుతూ ఆ ఉత్తరాన్ని ఒక నమ్మకమైన దాసిచేతికిచ్చి పోస్టుకు పంపింది

ఆ ఉత్తరమువల్ల ఏమీ ఫలితములేకపోయింది అపూర్వ ఇంటికి రాలేదు ఇది చదువరులు ఊహించగల సంగతే!

## 8

సెలవు లివ్వగానే అపూర్వ ఇంటికి రాకపోవడముచూచి అతను ఇంకా కోపముగానే ఉన్నాడని మృణ్మయి అనుకొన్నది తనమీద ఇంకా చీకాకుపడుతున్నాడని నన్ను తానువ్రాసిన ఉత్తరముమాట జ్ఞాపకము వచ్చి చాలా సిగ్గుపడుతున్నది ఆ ఉత్తరము అతిసామాన్యమైనది అందులో ఏమీ వ్రాయనేలేదు ఆమె మనస్సులో ఉండేదేదీ అందులో లేనేలేదు అది చదివాక అతను నన్ను ఎంతో నిరసిస్తాడు—ఇట్లాగు అనుకొంటూ బాణాలతో కొట్టబడినట్టుగా లోలోపల బాధపడుతున్నది ఆ ఉత్తరము పోస్టులో వేశావా అని దాసిని మాటిమాటికి అడిగేది "నాచేతితో నేనే పోస్టుడబ్బాలో వేశాను బాబుగారికి ఎన్నాళ్లక్రిందటనో అందిపోయివుంటుంది" అని దాసి అన్నది

చివరకొకనాడు అత్తగారు మృణ్మయిని పిలిచి "చాలా రోజులయింది ఇంటికి రాలేదు ఒకమారు కలకత్తావెళ్లి చూచివద్దామని అనుకుంటున్నాను నువ్వుకూడా నాతో వస్తావా?" అని అడిగింది మృణ్మయి సమ్మతిని తెలియచేస్తూ తలఊచి గదిలోకి వచ్చి తలుపులు మూసుకొన్నది మంచముమీద పడుకొని తలగడ గుండెపై గట్టిగా నొక్కుకొని తనలోతాను ఆనందముతో నవ్వుకొనసాగింది తరువాత కొంతసేపటికి ఏమేమో అనుకొని భయపడి ఏడవసాగింది

అనుతపిస్తున్న ఆ స్త్రీలిద్దరూ అపూర్వుని దయను కోరుతూ కలకత్తాకు బయలుదేరారు వస్తున్నామని అతనికి ముందుగా తెలియచేయలేదు కలకత్తాలో అపూర్వుని బావగారి ఇంట బసచేశారు

మృణ్మయిదగ్గరనుంచి ఉత్తరము వచ్చే ఆశవదులుకొని ఆ సాయంకాలమే అపూర్వ తానే ఆమెకు ఉత్తరము వ్రాదామని కూర్చున్నాడుకాని సరిఅయినమాట ఒకటీ రాకుండా ఉన్నది తన మనస్సులోఉండే ప్రేమను తెలియచేస్తూ తనకు కలిగిన అనాదరణ అభిమానాన్ని తెలియచేసే సంబోధన పదము కోసము వెదికాడుకాని ఏదీ తట్టకపోవడముచేత మాతృభాషమీద అతనికిగల అగౌరవము మరింత దృఢమయింది అంతలో బావదగ్గిరనుంచి ఉత్తరము వచ్చింది—స్వగ్రామమునుంచి అమ్మ వచ్చిందనీ అమ్మను చూడడానికి రావలసిందనీ వచ్చి ఆ రాత్రి తానుకూడా అక్కడే భోజనానికి ఉండిపోవలసిందనీ బావ వ్రాశాడు ఇంట్లో అంతా క్షేమము అని బావ ఉత్తరములో చివరకు తెలియచేసినప్పటికీ ఆ శుభవార్త ఏదైనా ఉండవచ్చునని భయపడుతూ అపూర్వ త్వరత్వరగా చెల్లెలి ఇంటికి వచ్చాడు

అమ్మ కనబడుతూనే సంకోచిస్తూ "అంతా క్షేమమా అమ్మా" అని అడిగాడు

"క్షేమమే కాని సెలవుల్లో నీవు ఇంటికి రాలేదు నిన్ను తీసుకువెళ్ళుదామని వచ్చాను." అని అన్నది తల్లి

"అందుకని ఇంత కష్టపడి రావడమెందుకు? లా-చదువు పూర్తికాగానే" మొదలైన నెపాలు వర్ణించడం ప్రారంభించాడు

భోజనము చేస్తూఉండగా చెల్లెలు, "అన్నయ్యా వదినను కలకత్తా తీసుకు వచ్చావుకాదేమి?" అని అడిగింది

"చదువవలసినది చాలాఉన్నది—చదువుకు అడ్డువస్తుందని " అని జవాబుచెప్పాడు అన్న

అది ఎట్టి మిష మా భయమువల్ల తీసుకు రాలేదేమో!" అని నవ్వుతూ అన్నాడు బావమరిది

"ఔను నిజమే నీది భయంకరాకారం పిల్లవాళ్ళు చూస్తే జడుసుకుంటారు " అని చెల్లెలు అన్నది

హాస్యాలాడుతూ ఈవిధముగా మాటలాడుకుంటున్నారు కాని అపూర్వకు మాత్రము ఏమీ సరదాగాలేదు అమ్మ కలకత్తా వస్తున్నప్పుడు రావలెనని కోరికఉంటే మృణ్మయికూడా సులభముగా ఆమెతో వచ్చి ఉండేది అమ్మ తీసుకురావాలని ప్రయత్నముకూడా చేసిఉంటుంది బహుశా మృణ్మయి ఒప్పుకొనిఉండదు దానిని గురించి అమ్మను అడగడానికికూడా అతనికి బుద్ధిపుట్టిందికాదు మానవజీవనంలోనూ విశ్వరచనలోనూ ఉండేవన్నీ తప్పులే అని తప్ప మరేమీ వాటిలో ఉండదుకాబోలునని అపూర్వకు తోచింది

వాళ్ల భోజనాలు పూర్తికాకపూర్వమే పెద్ద గాలీ వానా ప్రారంభమయింది

"ఈ రాత్రి ఇక్కడే ఉండిపో అన్నయ్యా " అన్నది చెల్లి

"ఉండను ఇంటికి వెళ్ళిపోవాలి, పని ఉన్నది " అన్నాడు అన్న

"రాత్రి నీకు ఉండే పని ఏమిటి? ఒక్క రాత్రి ఇక్కడ పడుకుంటే నిన్ను అడిగే వాళ్లెవరు? నీకెందుకు అంత భయము? "అని బావమరిది అన్నాడు

బలవంతము చెయ్యగా చెయ్యగా ఇష్టము లేకపోయినా ఆ రాత్రి చెల్లెలిగారి ఇంట్లో ఉండిపోడానికి ఒప్పుకున్నాడు అపూర్వ

"చాలా అలిసిఉన్నట్టు కనబడుతున్నావు అన్నయ్యా ఇక ఆలస్యముచెయ్యకు పడుకుందువుగాని పద ' అన్నది చెల్లి

అపూర్వ కోరికకూడా అదే—పక్క మీదికివెళ్ళి ఒంటరిగా చీకటిలో పడుకుంటే హాయిగా ఉంటుందని అనిపిస్తుందెను ఆ ప్రశ్నలు విన్నా జవాబు చెప్పవలసినవసరంలేకపోవడం అతనికి అమిత చీకాకుగా ఉన్నది

పడకగది దగ్గిరికి వచ్చిచూచేటప్పటికి గదిలో దీపములేదు చీకటి—"గాలికి దీప మారిపోయిఉంటుంది దీపము తెచ్చేదా అన్నయ్యా?" అని చెల్లి అడిగింది

"అవసరములేదు పడుకున్నప్పుడు నాకు దీపము అలవాటులేదు." అని అన్న జవాబు చెప్పాడు

చెల్లి తిరిగి వెళ్లిపోగానే అపూర్వ గదిలో ప్రవేశించి మెల్లిగా మంచముపైపు వెళ్ళుతున్నాడు మంచము ఎక్కబోయేటప్పటికి చేతిగాజుల శబ్దము వినబడ్డది మెత్తని చేతులతో అతనిని గట్టిగా పట్టుకొన్నారెవరో. పూరేకులవంటి పెదవులతో అతన్ని అత్యాదరముతో ముద్దుపెట్టుకున్నారు

కన్నీటితో తడుస్తున్న ఆ పెదవుల ముద్దు తాకగానే ఆశ్చర్యపడడానికైనా అతనికి వ్యవధి చిక్కలేదు మొదట అపూర్వ ఉలికిపడ్డాడు కాని తక్షణమే బోధపరుచుకున్నాడు—చాలా రోజులక్రింద మృణ్మయి నవ్వువల్ల చేయలేకపోయిన పని ఇవాళ అశ్రువారలతో కలిసి ఈవిధముగా పరిణమించింది

—•••—




ఉచితము

కాశ్మీరీ శాస్త్రం

ఇదుగో మీకు కావలసిన పుస్తకం ఇందులో స్త్రీ, పురుషుల రంగుల ఫొటోలు 284 ఉన్నవి ప్రకటన ఖర్చులకుగాను 8 అణాలు పంపుతూ ఫ్రీ కాపీకి వ్రాయండి త్వరపడండి లేనియెడల మీ అవకాశం పోగొట్టుకొనగలరు

Paris Art House Halqa 5 (D—304) AMRITASAR

# ఏరిన ముత్యాలు

## హైద్రాబాదు జనాభా లెక్కలు
### (భాషలు, మతాలు, అక్షరాస్యత)

సి కె మూర్తి ఐ ఎ ఎస్

హైదరాబాదు రాష్ట్రంలోని ప్రతి ఒక్క వెయ్యి ప్రజలలో 862 మంది హిందువులు 118 మంది మందిముస్లింలు 16 మంది క్రైస్తవులు ఇద్దరు జైనులు ఒక్కరు ఆదివాసులు మిగిలిన ఒక్కరిలో వారు సిక్కులైనా కావచ్చు లేక పార్సీవారైనా కావచ్చు. లేదా బౌద్ధమతస్థులో లేక యూదులో అయియుండవచ్చు లేదా మరే యితర మతమునకో లేక ఏ మతమునకూ చెందనివారై ఉండవచ్చును శేషించిన ఈ వర్గంలో ప్రతి ఇద్దరు వ్యక్తులలోను ఒకరు సిక్కు మతమునకు చెందినవారై ఉన్నారు ఈవిధంగా రాష్ట్రి జనాభాలో హిందువులు అధిక సంఖ్యాకులై ఉన్నారు. అయితే రాష్ట్రమంతటా వారి సంఖ్య అత్యధికంగా లేదు పశ్చిమ జిల్లాలలోకంటె తూర్పు జిల్లాలలో హిందువులు ఎక్కువగా ఉన్నారు. పట్టణాలలోకంటె పల్లెలలోనే హిందువులు అత్యధిక సంఖ్యలో ఉన్నారు. గ్రామీణ జనాభాలో హిందువులు నూటికి 91 మంది ఉంటే పట్టణ జనాభాలో వారు నూటికి 64 మంది మాత్రమే ఉన్నారు. అన్ని జిల్లాలకంటె కరీంనగర్ జిల్లాలో హిందువులు అధిక శాతంలో ఉన్నారు. అక్కడ వారి జనాభా నూటికి 94 వంతులు. హైద్రాబాదు జిల్లాలో హిందువుల శాతం తక్కువగా ఉన్నది. ఆ జిల్లాలో మొత్తం జనాభాలో హిందువులు నూటికి 63 మంది ఉన్నారు. హైదరాబాదు నగరంలో అంటే, హైద్రాబాదు, సికింద్రాబాదు మునిసిపాలిటీలు, కంటోన్మెంటు ప్రాంతంలో మొత్తం కలిపితే హిందువులు నూటికి 52 మంది మాత్రమే ఉన్నారు. ఇదివరలో పేర్కొనబడిన 8 వృత్తులలోను (అ) సొంత సేద్యం (ఆ) కౌలుదారి సేద్యం (ఇ) వ్యవసాయకూలీలు (ఈ) ఉత్పత్తి ద్వారా జీవనోపాధి యున్నగు వృత్తులలో హిందువులు జనాభాలో వారి సంఖ్యకంటె ఈ వృత్తులలో హెచ్చుగానే ప్రాతినిధ్యం కలిగిఉన్నారు అయితే (ఉ) పరోక్ష భూస్వామ్యం (ఊ) వాణిజ్యం (ఎ) రవాణా (ఏ) ఇతర వివిధ వృత్తులు మున్నగువాటిలో హిందువుల ప్రాతినిధ్యం వారి సంఖ్యనుబట్టిలేక కొంచెం తక్కువగా ఉన్నది

రాష్ట్రి జనాభాలో హిందువుల తరువాత ముస్లింలు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు రాష్ట్రి మొత్తం జనాభాలో వారు నూటికి 12 మంది కంటె కొంచెము తక్కువగా ఉన్నప్పటికి రాష్ట్రంలోని తూర్పుభాగంకంటె పశ్చిమభాగంలో వారు ఎక్కువగా ఉన్నారు గ్రామాలలోకంటె పట్టణాలలోనే ముస్లిములు అధికసంఖ్యలో నివసిస్తున్నారు. గ్రామీణ జనాభాలో వారు నూటికి 7 మంది మాత్రమే కాని పట్టణ జనాభాలో వారు నూటికి 34 మంది ఉన్నారు అన్ని జిల్లాలలోకంటె హైద్రాబాదు జిల్లాలో ముస్లిముల శాతం హెచ్చుగా ఉన్నది ఆ జిల్లాలో వారు నూటికి 35 మంది కరీంనగరం జిల్లాలో ముస్లింల శాతం బహు తక్కువగా ఉన్నది అక్కడ వారు నూటికి 5 మంది మాత్రమే రాష్ట్రి మొత్తం జనాభాలో గల ముస్లిములలో 1/5 వంతులు హైద్రాబాదు నగరంలో ఉన్నారు అంటే హైద్రాబాదు నగరంలో ముస్లిముల శాతం 45 గుల్బర్గా ఔరంగాబాదు జిల్లాలు కొన్ని శతాబ్దములవరకు ముస్లిము రాజ్యాల ఏలుబడిక్రింద ఉన్నవి కాబట్టి ఆ జిల్లాలలో ముస్లిముల సంఖ్య హెచ్చుగా ఉన్నవి బీదర్, గుల్బర్గా జిల్లాలలో నూటికి 16 మంది, ఔరంగాబాదు జిల్లాలో నూటికి 14 మంది ముస్లిములు ఉన్నారు. వృత్తులవారీగా ముస్లిముల ప్రాతినిధ్యాన్ని పరిశీలించితే (అ) పరోక్ష భూస్వామ్యం (ఆ) వాణిజ్యం (ఇ) రవాణా (ఈ) వివిధ వృత్తులలో ముస్లిముల ప్రాతినిధ్యం వారి జనాభాకంటె హెచ్చుగాఉన్నది. మిగిలిన నాలుగు వృత్తులలో వారి ప్రాతినిధ్యం వారి జనాభాకు తగినట్లుగా లేదు

ముస్లిములతరువాత క్రైస్తవులు అధికసంఖ్యాకులుగా ఉన్నారు అయితే వారు ముస్లిములకన్నను ఇంకా హెచ్చుగా చెదరువారుగా నివసిస్తున్నారు క్రైస్తవులలో నూటికి 75 మంది తెలుగు జిల్లాలలో నివసిస్తున్నారు మిగిలిన 25 మంది మరాఠీ కన్నడ జిల్లాలలో ఉన్నారు బీదరు జిల్లాలలో క్రైస్తవుల సంఖ్య హెచ్చు రాష్ట్రంలోగల మొత్తం క్రైస్తవ జనాభాలో నూటికి 10 మంది బీదర్ జిల్లాలో ఉన్నారు. జిల్లాలవారి శాతం చూస్తే వరంగలు జిల్లాలో క్రైస్తవుల శాతం హెచ్చు అక్కడ వారు నూటికి 4 గురు అన్నిటికంటె ఉస్మానాబాదు జిల్లాలో వారి శాతం బహు తక్కువ. అక్కడ వారు నూటికి 0 04 మంది హిందువులకంటె ఎక్కువగాను ముస్లిములతో పోల్చిచూచినట్లయితే తక్కువగాను క్రైస్తవులు పట్టణాలలో నివసిస్తున్నారు క్రైస్తవులలో నూటికి 24 మంది పట్టణాలలోను 76 మంది గ్రామాలలోను నివసిస్తున్నారు వృత్తులవారీగా చూస్తే క్రైస్తవులు (అ) వ్యవసాయకూలీలు, (ఆ) రవాణా, (ఇ) వివిధ వృత్తులలో ఎక్కువ ప్రాతినిధ్యం కలిగిఉన్నారు కౌలుదారీ సేద్యంలో వారి ప్రాతినిధ్యం వారి జనాభాకు తగినట్లుగా ఉన్నది కాని ఇతర వృత్తులలో వారి ప్రాతినిధ్యం తక్కువగా ఉన్నది

రాష్ట్రం మొత్తం జనాభాలో హిందువులు, ముస్లింలు క్రైస్తవులుపోను మిగిలిన 0 4 వారు ఇతర మతస్థులై ఉన్నారు పైవిధంగా మిగిలిన

వారిలో జైనులు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. బొంబాయి రాష్ట్రమును అనుకొనియున్న ప్రాంతం లోను పర్భణీ జిల్లాలోను హైదరాబాదు నగరం లోను జైనులు ఎక్కువగా నివసిస్తున్నారు జైను లలో నూటికి దాదాపు 50 మంది వాణిజ్యంపై జీవిస్తున్నారు నూటికి 6 కంటె ఎక్కువమంది భూములపై వచ్చే కౌళ్ళపై జీవిస్తున్నారు ఈ రెండు శాతములు హైదరాబాదు రాష్ట్రానికి హెచ్చు శాతములని చెప్పవలెను జైనుల తరువాత ఆదిమ తెగలవారు ఎక్కువమంది ఉన్నారు అట్టివారు ప్రత్యేకంగా ఒక్క ఆదిలాబాదు జిల్లాలోనే ఉన్నారు రాష్ట్రంలోని ఆదిమవాసుల మొత్తం సంఖ్యలో ఆ తెగవారు అల్పసంఖ్యాకులు మిగి లిన ఆదిమవాసులు తమతమ మతములను ఆ ప్రత్యేక మతమని చెప్పలేరు ఏదో ఇతర మతాలు వారు చెప్పారు సిక్కులలో నూటికి 58 మంది హైదరాబాదు నగరంలోను నాందేడు జిల్లాలోను దాదాపు సరిసమానంగా ఉన్నారు వారిలో సగంమంది వివిధ వృత్తులపై జీవిస్తు న్నారు పార్సీవారు ఎక్కువగా హైదరాబాదు నగ రంలో ఉన్నారు వారి మొత్తం జనాభాలో నూటికి 73 మంది హైదరాబాదు నగరంలోనే ఉన్నారు నూటికి పైచిల్లరగాతక్క లొద్దముక్తులుగా చాలా తక్కువమంది పారిశ్రామిక వసతిగృహాలలో నివ సిస్తున్నారు

ఈ శతాబ్దారంభంనుంచి హిందువుల ఆదిమ మతస్థుల కలిసి నూటికి 62 మంది వరకు పెరిగి నారు ఈ శతాబ్దారంభంనుంచి రాష్ట్రజనాభా నూటికి 67 వంతులు పెరిగింది దీనినిబట్టి హిందువులు, ఆదిమ మతస్థుల పెరుగుదల తక్కు వగా ఉన్నట్లు వ్యక్తమవుతున్నది. హిందువుల జనాభా పెరుగుదల తక్కువగా ఉండడానికి ముఖ్యకారణ మేమిటంటే వారిలో కొంతమంది అప్పుడప్పుడు క్రైస్తవ మతంలో చేరుతూ ఉంటారు ఒకొక్కప్పుడు అట్టి మతాంతీకరణ కొంచెం ఎక్కువగా జరగడం కద్దు ఈ శతా బ్దారంభంనుంచి ముస్లిముల సంఖ్య నూటికి 91 వంతుల వరకు పెరిగింది ఇందుకు ముఖ్యకారణ మేమంటే 1901 నుంచి రాష్ట్రంలోనికి వలస వచ్చినవారిలో ముస్లిముల శాతం చాలాహెచ్చుగా ఉన్నది. అయితే అన్ని మతాలవారికంటె క్రైస్తవ మతమువారి జనాభా పెరుగుదల మిక్కిలి హెచ్చుగా ఉన్నది ఈ శతాబ్దారంభం నుంచి వారు నూటికి 165 వంతులవరకు పెరి గారు ఇందుకు ముఖ్యకారణం ఏమంటే హిందు వులను, ఆదిమ మతస్థులను ఎక్కువగా మతాంతీ కరణ చేయడం జరిగింది గత దశాబ్దంలోనే క్రైస్తవులు నూటికి 32 వంతులవరకు హెచ్చి నారు కాని ఆదేశాలంలో సాధారణ జనాభా పెరుగుదల నూటికి 14 వంతులు మాత్రమే ఒక్క బీదరు జిల్లాలోనే క్రైస్తవులు గతదశా బ్దంలో నూటికి 180 మంది చొప్పున పెరిగినారు 1901 నుంచి సిక్కులు 91 వంతులమంది చొప్పున జైనులు 49 మందిచొప్పున పార్సీ వారు 38 మందిచొప్పున హెచ్చుఅయినారు

హైదరాబాదు రాష్ట్రంలో భాషలుకూడా వివి ధంగా ఉన్నాయి ఒక భాషపై మరొక భాషా ప్రభావంకూడా విస్తృతంగా ఉన్నది అయితే దానితో ఈ ప్రసంగమునకు నిమిత్తములేదు ఇటీవల తీయబడిన జనాభా లెక్కలనుబట్టి ఈ రాష్ట్రములో 238 మాతృభాషలు మాండలికాలు కులమువారి మాండలికాలు ఉన్నట్లు తెలిసింది ఈ జనాభా లెక్కలలో ప్రజలు తమ మాతృ భాష ఏదని చెప్పినారో నిశ్చితంగా దానినే వ్రాయడమైనది ఇన్ని భాషలలోను లక్షకు పైబడిన జనం మాట్లాడే భాషలు ఆరు మాత్రమే ఉన్నవి అవి తెలుగు మరాఠీ ఉర్దూ కన్నడం లంబాడీ హిందీ భాషలు ఈ రాష్ట్ర జనాభాలో ప్రతి నూరుమందికి 48 మంది తెలుగు మాట్లాడు తారు 24 మంది మరాఠీ 12 మంది ఉర్దూ, 11 మంది కన్నడం ముగ్గురు లంబాడీభాష, ఒక్కరు హిందీ మాట్లాడుతారు అంటే 4 గురు తెలుగు మాట్లాడేవారుంటే ఇద్దరు మరాఠీ మాట్లాడువారు ఒక్కరు ఉర్దూ మరి ఒక్కరు కన్నడం మాట్లాడువారున్నారు తూర్పుప్రాంతం లోని 8 జిల్లాలలో అంటే హైదరాబాదు మహ బూబునగర్ ఆదిలాబాదు నిజామాబాదు, మెదక్, కరీంనగర్ వరంగల్లు నల్లగొండ జిల్లాలలో తెలుగు మాట్లాడేవారే ప్రధానముగా ఉన్నారు ఈ 8 జిల్లాలలోని మొత్తం జనాభాలో నూటికి 78 మంది తెలుగు మాట్లాడేవారు ఉన్నారు ఈ 8 జిల్లాలలోను కరీంనగరం జిల్లాలో తెలుగుమాట్లాడేవారి శాతం హెచ్చుగా ఉన్నది ఆ జిల్లాలో నూటికి 94 మంది తెలుగు మాట్లాడుతారు అన్నిటికంటె తక్కువ శాతం హైదరాబాదు జిల్లాలో ఉన్నది ఈ జిల్లాలో నూటికి 53 మంది తెలుగు మాట్లాడుతారు అయితే రాయచూరు గుల్బర్గా బీదర్ నాందేడు జిల్లాలలో తెలుగు మాతృభాషగా గలవారిసంఖ్య బాగావేఱున్నది రాయచూరు జిల్లా మొత్తం జనా భాలో నూటికి 24 మంది, గుల్బర్గాలో నూటికి 21 మంది బీదర్‌లో నూటికి 15 మంది, నాందే డులో నూటికి 14 మంది తెలుగు మాతృభాష గలవారు ఉన్నారు రాష్ట్ర మొత్తం జనాభాలో మరాఠీ మాట్లాడువారు నూటికి 24 మంది మాత్రమే ఉన్నప్పటికీ, పశ్చిమోత్తర జిల్లాలలో అనగా ఔరంగాబాదు, పర్భణీ, నాందేడ్ బీడ్, ఉస్మానాబాదు జిల్లాలలో వారు నూటికి 79 మంది కలరు ఈ ఐదు జిల్లాలలో బీడ్‌లో మరాఠీవారి శాతం 87 నాందేడ్‌లో 60, బీదర్‌లోని కొన్ని ప్రదేశాలలో ఆదిలాబాదు జిల్లాలోని కొన్ని ప్రదేశాలలోను మరాఠీ మాట్లాడువారు ఉన్నారు బీదర్‌లో వారు నూటికి 39 మంది ఆదిలాబాదు జిల్లాలో నూటికి 21 మంది ఉన్నారు

రాష్ట్రంలో తెలుగు, మరాఠీల తరువాత ఉర్దూ మాట్లాడేవారి సంఖ్య హెచ్చుగా ఉన్నది అయితే తెలుగు, మరాఠీ కన్నడములవలె ఉర్దూ ఒక్క జిల్లాలోను అధికసంఖ్యాకుల మాతృ భాషగా లేదు జిల్లాలవారిగా చూస్తే హైదరాబాదు జిల్లాలో నూటికి 35 మంది ఉర్దూ మాట్లాడేవారు ఉంటే కరీంనగర్ జిల్లాలో నూటికి 4 గురు మాత్రమే ఉర్దూ మాట్లాడుతారు అయితే పట్టణ ప్రాంతాలలో ఉర్దూ మాట్లాడేవారి శాతం ఎక్కు వగా ఉన్నది. యథార్థంగా చూస్తే పట్టణ జనాభా మొత్తంలో నూటికి 34 మందికి ఉర్దూ మాతృ భాషగా ఉన్నది హైదరాబాదు నగరంలో నూటికి 45 మందివరకు ఉర్దూ మాతృభాషగా గలవా రున్నారు గుల్బర్గా పట్టణంలో నూటికి 49 మంది ఉర్దూ మాట్లాడుతారు

ఆతరువాత నాల్గవవర్గం కన్నడం మాట్లాడు వారిది రాయచూరు గుల్బర్గా జిల్లాలలో వారు అత్యధిక సంఖ్యలో ఉన్నారు రాయచూరు జిల్లాలో నూటికి 63 మంది, గుల్బర్గా జిల్లాలలో నూటికి 65 మంది కన్నడం మాట్లాడుతారు బీదర్ జిల్లా మొత్తం జనాభాలో నూటికి 28 మంది కన్నడం మాట్లాడుతారు ఆ జిల్లాలోని మొత్తం 9 తహశీళ్ళలోను నాల్గింటిలో కన్నడం మాట్లాడువారిదే ఏకైక అధికసంఖ్యాకవర్గమై యున్నది

ఈ రాష్ట్రంలో లంబాడీకూడా ఒక ముఖ్య మైన భాషయని చాలామందికి తెలియదు ఇక్కడ మొత్తం 5-1/2 లక్షలమంది లంబాడీ మాట్లాడు తారు కొన్ని కొన్ని ప్రాంతాలలో అక్కడి ప్రాంతీయభాషలను మినహాయిస్తే ఇతర భాషల కన్న లంబాడీ మాట్లాడువారే ఎక్కువగా కని

పిస్తారు. ఉదాహరణ: వరంగల్లు, నల్లగొండ జిల్లాలలో ఉర్దూ కన్నడం, మరాటీ భాషలు మాట్లాడేవారికంటే లంబాడీ భాషను మాట్లాడు వారే హెచ్చుగా ఉన్నారు ఇట్లే ఔరంగాబాదు పర్భణీ బీడ్ జిల్లాలలో తెలుగు లేక కన్నడం మాట్లాడువారికంటె లంబాడీ మాట్లాడువారే ఎక్కువమంది గలరు

పరదేశ మున్నగు భాషలను మినహాయిస్తే హిందీ మాతృభాషగా గలవారిసంఖ్య దాదాపు 1 లక్ష 85 వేలు ఉన్నది. మిగిలినవారిలో 90 వేల మందికిపైగా ప్రజలు తమ మాతృభాష గోండు భాష అని చెప్పినారు ఆదిలాబాదు జిల్లాలో చాలా మంది తమ భాష కోయభాష యని లేక కోలమి భాష అనీ, మన్నె భాషయని నాయకపోడి భాష యని చెప్పినారు 1911 నుంచి గివరి మూడు భాషలను చెప్పడం ఇదే మొదటి పర్యాయం

ఈ శతాబ్దారంభంనుంచి లంబాడీ మాట్లాడు వారి సంఖ్య నూటికి 860 వంతులచొప్పున హిందీ మాట్లాడువారి సంఖ్య నూటికి 365 వంతుల చొప్పున పెరిగింది లంబాడీ పెరగ డానికి కారణం ఈసారి జనాభా లెక్కలు కడు వాస్తవికంగా తీయబడినవి హిందీవారి సంఖ్య పెరగడానికి కారణమేమంటే ప్రజలు ఇదివరలో తాము మాట్లాడుతున్న భాషయొక్క పేరును మార్చిచెప్పడంకూడా జరిగింది ఇదేకాలంలో ఉర్దూభాష నూటికి 46 వంతులచొప్పున, తెలుగు భాష నూటికి 78 వంతులచొప్పున మరాటీ 87 వంతులచొప్పున కన్నడం నూటికి 26 వంతులచొప్పున పెరిగింది ఈ పెరుగుదలలు ఆయాప్రాంతాలలో జనాభా పెరుగుదలను వ్యక్త పరుస్తున్నవి.

ఈ రాష్ట్రి మొత్తం జనాభాలో నూటికి 9.2 మంది అక్షరాస్యులున్నారు అంటే వీరికి చద వడం వ్రాయడం వచ్చునన్నమాట వీరుగాక దాదాపు నూటికి ఒక్కరికి చదవడం మాత్రమే వచ్చును ఇండియన్ యూనియన్ రాష్ట్రాలతో పోల్చిచూచినట్లయితే హైదరాబాదు రాష్ట్రి అక్ష రాస్యత శాతం బహుతక్కువగా ఉన్నది బొంబాయి రాష్ట్రంలో నూటికి 24.6 మంది, మద్రాసులో 19.3 మంది మధ్యప్రదేశ్‌లో 13.5 మంది చదువుకున్నవారున్నారు. ఈ రాష్ట్రంలో వృత్తు లనుబట్టి కొన్ని కొన్ని వృత్తులవారిలో నిరక్ష రాస్యత ఎక్కువగా ఉన్నది స్త్రీ పురుషులలో కూడా అక్షరాస్యత వ్యత్యాసం బాగా కనిపిస్తు న్నది వ్యవసాయం చేసేవారిలో నూటికి 6.8 మంది మాత్రమే చదువుకున్నవారు ఉంటే వ్యవసాయేతర జనాభాలో నూటికి 17.5 మంది చదువుకున్నవారు ఉన్నారు ఎరోతి భూస్వాము లలో నూటికి 14.7 మంది చదువుకున్నవారు ఉంటే సొంత సేద్యం చేసుకొనువారిలో నూటికి 6.8 మంది, కౌలుదార్లలో నూటికి 2.5 మంది వ్యవసాయ కూలీలలో నూటికి 1.4 మంది ఉన్నారు వ్యాపారం చేసుకొనువారిలో నూటికి 27.9 మంది వివిధ వృత్తులు చేయువారిలో నూటికి 22.8 మంది, రవాణాలో 18.5 మంది సేద్యంగాక ఇతర ఉత్పత్తివర్గంలో 9.3 మంది చదువుకున్నవారు ఉన్నారు పురుషులలో నూటికి 15.1 మంది స్త్రీలలో 3.0 మంది చదువుకున్న వారు ఉన్నారు వ్యవసాయ తరగతులలోని పురు షులలో నూటికి 9.4 వ్యవసాయేతర తరగతుల వారిలో నూటికి 27.2 మంది చదువుకున్నవారు ఉన్నారు అన్ని వృత్తులకంటె వాణిజ్యంలో చదువుకున్నవారి శాతం హెచ్చు అంటే వారిలో నూటికి 46.6 మంది అక్షరాస్యులున్నారు ఆ ఇద్దరికంటె తక్కువ అక్షరాస్యత వ్యవసాయ కూలీలలో ఉన్నది వారిలో నూటికి 2.6 మంది చదువుకున్నవారు ఉన్నారు వ్యవసాయ వృత్తుల వారిలో స్త్రీలలో నూటికి ఒక్కరు మాత్రమే చదువుకున్నవారు ఉన్నారు వ్యవసాయేతర వృత్తులవారిలో స్త్రీలలో 7.4 మంది చదువుకున్న వారున్నారు పురుషులలో ఎక్కువగా చదువు కున్నవారు వాణిజ్యవర్గంలో ఉంటే స్త్రీలలో చదువుకున్నవారు ఎక్కువమంది వివిధవృత్తుల వర్గంలో ఉన్నారు ఆ వర్గంలో నూటికి 12.1 మంది స్త్రీలు చదువువచ్చినవారున్నారు వాణిజ్య వర్గంవారిలో స్త్రీ విద్య వివిధవృత్తుల వర్గం వారిలో స్త్రీలకుగల విద్యవలె ఎక్కువ వ్యాప్తి గాంచలేదు వ్యవసాయ కూలీలలో చదువుకున్న స్త్రీలు నూటికి 0.2 మాత్రమే ఈ శతాబ్దంలోని మొదటి మూడు దశాబ్దాలకాలంలో ఈ రాష్ట్రం అక్షరాస్యతారంగంలో ఏమీ అభివృద్ధిచెందనట్లు కనిపిస్తున్నది 1901 లో తీయబడిన జనాభా లెక్కలలో అక్షరాస్యత నూటికి 3.0 అని తేలింది. కాని 1911 లో తీయబడిన లెక్కలలో ఈ శాతం 2.8 వరకు తగ్గిపోయింది తిరిగి 1921 లో ఈ శాతం 2.9 అయింది. అప్పటి నుంచి ఈ రాష్ట్రం అక్షరాస్యత విషయంలో అభివృద్ధిచెందుతూ వచ్చింది అయితే ఈ అభి వృద్ధి గొప్పగా చెప్పుకోవలసినంతగా లేదు. 1931 లో అక్షరాస్యులైనవారు నూటికి 4.1 మంది వుంటే 1941 లో అక్షరాస్యత 7.8 అయింది ఆతరువాత 1951 లో 9.2 వరకు పెరిగింది

—వేత (27-7-53)

## స్త్రీల కథాగేయములు

### "కృష్ణశ్రీ"

కల్పనా రసానందమూ పండితుల ప్రత్యేక హక్కులు కావు జనసామాన్య మంతటిలోనూ మనస్సులు కల్పనలూ హృదయాలు రసానందాన్ని కోరుకుంటాయి చిన్నపిల్లల లేతమనస్సులూ, హృదయాలుకూడా కల్పనల్ని మెచ్చుకోడమూ, రసాత్మకరచనలకి దుల్లమానదమూ వారి కథా శ్రవణ సమయాల్లో మనకి అనుభవమే మానవుని అనుభవాలు విన్న మానవహృదయాలు యుల్లా సనదమూ మానవుని కల్పనల్ని మనస్సులు ఆమోదించడమూ నైసర్గికమే ఇది స్త్రీలకుకూడా చెల్లుతుందని వేరే చెప్పడమెందుకూ? పల్లెలలో విన్నటిపరకూ పురుషులు వెలివెట్టినా, గృహ సీమలోనూ గ్రామసీమలోనూ మంగళసమయా లలోనూ స్త్రీల సంస్కృతి సహజసౌందర్యాన్ని పెంచుకుంటూనే వుండినది ఈ అందపు సంస్కృతికి దోహదముచేసినవే కథాగేయాలు. అకృత్రిమత్వమూ హృదయాభిముఖత్వమూ ఈ గేయాల జన్మహక్కులు వీటి శ్రోతలు అమలిన మనస్కులూ, స్వార్థాహంకార రహితులూను. వారు కోరేది రీతి, అలంకారమూ, గుణమూ, ధ్వనీ అని ఏర్పడిపోయుండవు అందువల్ల వారి కానందాన్నిచ్చే పద్ధతులు నైసర్గికములేగాని కృత కములు కావు మాత్రాబద్ధములై వుండడమూ, పరిమితి కలిగివుండడమూ మాత్రమే వీటికి వర్తించే నియమాలు వీటిని తీర్చిదిద్దేది రచ యితల మనస్సులు కాదు, హృదయము, కాబట్టి సార్వజనీనతావాలే వుంటాయి వీటిలో అక్క డక్కడ మాత్రం నక్షత్రాలలాగ—కాదు పెను పులలాగ—వ్యక్తుల రచనాసౌందర్యము తళుక్కు మంటూ ఉంటుంది

—భారతి (జూన్ 53)

## మాటల దాంపత్యం

### వాయని కృష్ణకుమారి

శబ్దమూ, అర్థమూ, పరస్పరమూ వేరులు కలవుకుని జంటగా ముందుకుసాగితే అదే భాష

అవుతుంది. అయితే భాషలో రూపొందిన ప్రతి మాటకూ నిశ్చితమైన అర్థం అన్నివేళలా వ్యక్తం కావాలని లేదు. ఒక్కొక్కసారి వక్త ఉపయోగించే మాటకూ ఉద్దేశించిన అర్థానికీ పొత్తు కుదరకపోవచ్చు. అంతమాత్రాన శబ్దార్థాల స్నేహం విడిపోదు భేదాభిప్రాయాలు కలిగిన అలుమగలకుమల్లే యివి ఇంటిగుట్టును రట్టు చేసుకోకుండానే చూచుకుంటవి. అందుకే శబ్దానికి తగిన అర్థం కుదరలేదనో, అర్థానికి అవసరమైన శబ్దం ప్రయోగ్యంకాలేదనో శ్రోత గమనించ లేడు వక్త పట్టించుకోడు ఇది యిట్లా సర్దుకు పోవడానికి కారణం శబ్దార్థాలకు మించిన సంజ్ఞా సహాయం భాషకు ముమ్మరంగా ఉంటుందిగనుక

మాటలే భాషను కూర్చేవి. వాటికున్న అర్థం భాషకు జీవంపోసి కలకలలాడిస్తుంది—మనిషి విదారంగా ఉన్నప్పుడు ఆ భావం వ్యక్తంచేసే మాటలు కరుణార్ద్రాలుగానే ఉంటవి. దిగులుగా దీనంగాసాగే వాక్కు మనిషి మనస్సు మన ముందు విప్పిపెడుతుంది వాక్కులేని వ్యక్తికి జంతువుకూ భేదం లేదు సంతోషాన్ని కోపాన్ని రౌద్రాన్ని, విరాగాన్ని శృంగారాన్ని ఒకటేమిటి మనుష్యుడి జీవితనాటకంలో అంగాంగి రసాలుగా అమరిన సర్వరససముదాయాన్ని వ్యక్తం చేసే మాటలు మానవజాతికి దివ్యవరాలు! ఆనందోద్రిక్తతలో ఎగిరి గంతులువేస్తూ, కొట్టి కోలాహలంచేసే పలుకులు, కోపంలో రౌద్రంలో కల్లోలజలధి విపరీతతరంగాలలా ఎగిరెగిరిపడే నిశితపదాలు, శృంగారతన్మయతలో త్రుళ్ళి తేలింత లాడే చిలిపిమాటలు. ఇవన్నీ మానవజగత్తు తనంతటతాను నిర్మించుకుంటే ఏర్పడినవా? ఆ మాటలగుంపు ఒకరు అమర్చుతున్నారనేవిషయం మనుష్యులకే తెలియకముందు అమరినవి మానవాంతర శక్తి బాహ్యప్రేరణకు తెలిసే లోపలనే చేసిన యీ యేర్పాటువల్ల భాష భగవన్నిర్మిత మనుకోవలసివచ్చింది

అయితే మాటకూ అర్థానికీ ఉండే శక్తి ఎప్పుడూ ఉన్నదా అనేది ఒక ప్రశ్న మాట, మాటగా, ఒంటరిగా ఉన్నంతవరకూ దానిలో సొగసుదనం రాదు. దానిలోని అర్థం తన శక్తిసామర్థ్యాలు చూపించే సమయం రాలేదని గుసగుసలాడు తుంది. మాటకున్న సొగసూ, అర్థంలోని సుకుమారతా బయటికి రావాలంటే, దానికి ఎన్నో హంగులు అమరాలి ఆ రెంటిమధ్యా కంటికి కనిపించని కూర్పేదో జరిగి మన మనసున్న ఫలితం బయటకు రాగలగాలి—అంటే మాటలు వాక్యరూపంలోకూడితే వివిధార్థదాలయిన పదాలు ఏకముఖాలయి రమణీయత్వ ప్రతిపాదకాలు కాగలవు

కాబట్టే భాషలోని సొగసుంతా వాక్యరచనలో ఉన్నది వాక్యమనేది రసాత్మకమైన కావ్య మన్నారు ఆలంకారికులు—అప్పుడు భాష భాషంతా ఒక కావ్యం కాదా? అనేది ప్రశ్న వస్తే—ఇది తెగని ప్రశ్న!

ఇంతకూ మాటల పొందికలోనే ఉంది భాష లోని తీయదనమంతా అని చెప్పడానికే ఈ ఉపోద్ఘాతం

తెలుగుభాష తీయనిభాష! ఆ మాటకువస్తే ఏ భాషలోనైనా తీయదనం ఉన్నది. కాని ఆ తీయదనమనేది ప్రతిభాషలోనూ చూడగానే కని పించేదికాదు. భాషలో వివిధ మార్గాలలో ప్రవ రించే మెళుకువలుతెల్పి శిక్షామపుల కళ్ళలో ఆ కాంతికిరణాలు సోకేవరకూ ఏ భాష గొప్ప తనమూ ప్రకాశితంకాదు. అయితే అనంతమై ప్రవాహి అయిన భాషను అవలోకనం చెయ్య లేకడం అసంభవం ఇదేకాదు; ఏ విషయాన్నీ పూర్తిగా తలచడానికి మానవజీవితమే చాలదు. అన్ని కోణాలనుండీ సమగ్రంగా ఒక విషయపరి శీలన మనేది ఒక్కరివల్ల కానిపని అట్లాగే తెలుగుభాష తీయదనం ఎందుకువచ్చిందో అని ప్రశ్నించుకుంటూ, ఇందుకూ అని పూర్తిగా చెప్పగం మనుకోవడం, సవ్యసాటు కాకపోతే బహువిధాల పయనించి చేరిన ఆ తీయదనాన్ని ఆస్వాదిస్తూ "బహుశ ఈవిధంగా రాలేదూ ఈ తీపి?" అని కొన్ని మార్గాలను, మనుష్యులకు కట్టినవాటిని చర్చించుకోవచ్చు ఈ చర్చలు పూర్తిగా దోషశూన్యమూకావు కాకపోతే స్ఖాలి త్యాలు ఉండవచ్చును.

వేరొక దోవ చెప్పాలంది కుతూహలపడు తున్నాను ఇది దోవ అవునా కాదా? నిజంగా తెలుగులోని తీయదనంలో ఇన్నోవంతు ఈ మార్గంగుండా వచ్చిందా లేదా అనే చర్చలు విజ్ఞులకు!

తెలుగుభాషలో ఒక విచిత్రపు ధోరణిఉన్నది. నాకు తెలిసిన ఇంగ్లీషులో ఇది కన్పించదు. కొద్దిగా తెలిసిన హిందీలో అక్కడక్కడా వున్నది మరి యితర భాషలలో వున్నదో లేదో!

ఇది జంటపదాల ఏర్పాటు. తెలుగువాళ్ళు తరుచూ ఈ పదాలు వినవస్తూనే వుంటవి. ఈ జంటలను చూస్తూవుంటే, వేదోక్తంగా వివాహితు లయిన దంపతులలా అనిపిస్తుంది. వాటి బాంధవ్య మంత స్థిరం అసలీ పదాల జన్మ ఏమిటి? ఏయే పరిస్థితులలో ఈ జమిలిమాటలు ఏర్పడవలసి వచ్చింది అనేది ప్రశ్న—

మాట్లాడేటప్పుడు మాతృభాషలో పొందికా, ఒదుగూ ప్రతివానికీ జన్మతః రానేవస్తవి కాని ఒక మాట ఒక సందర్భంలో వాడినప్పుడు చెప్పదలచుకొన్న అర్థం ఆ మాటవల్ల అర్థంకాక పోవచ్చు కథితం కాలేదేమోనన్న అసంతృప్తి వక్త మస్తిష్కంలో పెంచవేయవచ్చు. అప్పుడు, ఆ మాట అట్లా ఒంటరిగా నిలవదు. ఒక తోడు తెచ్చుకుంటుంది ఆ తోడు ఎటువంటిదో, రెంటికీ ఏర్పడిన సంబంధబాంధవ్యాలెటువంటివో ఆ రెండింటి సాన్నిహిత్యంవల్లా వక్త ఆశించిన మెరుగు లెంతవరకు ప్రకాశాలయినవో—ఇవన్నీ మనం పరిశీలించవచ్చును. మన కీనాటి చర్చకూడా అదే!

ఈ సంబంధం చిత్రవిచిత్రంగా కనిపిస్తుంది ఒక్కొక్కపదం మరొకపదం పక్కనవుంటే ముచ్చటగా భర్త మనస్సు తెలిసి మెలిగే భార్యలా అనిపిస్తుంది మరొకటి పసిపాపలా, అమాయ కంగా లోకవ్యవహారమే తెలియనట్లు స్తబ్ధంగా వుండి అంతులేని అందాన్ని కూరుస్తుంది. ఇంకొకటి వృత్త వసపోసిన వాగుడుపిల్లలా అర్థం లేని మాటలాడుతున్నట్లుంటుంది. మరొకటి అర్థమూ, పర్థమూ లేకపోయినా అది అక్కడ వుంటేనే విందూ, అందమూ

కాబట్టి ఈ జంటమాటలలో ప్రయోజకత్వ మంతా రెండవమాటది. ఆ మాటలూ, దానితీరూ, అది యిచ్చే అర్థమూ వీటిమీదే ఆ జంటయొక్క రామణీయకం ఆధారపడివుంటుంది.

—భారతి (జూన్, 68)

శ్రీ వైశ

# విదేశీయ పదములు

చిల్లరిగె కృష్ణమూర్తి

వివిధ జాతులమధ్య పరస్పర సంబంధము ఏర్పడినప్పుడు ఒక జాతియొక్క సంస్కృతి సభ్యత మున్నగువాని ప్రభావం మరియొక జాతిమీద పడుతుంది రెండువందల సంవత్సరాలు మనలను పరిపాలించిన ఆంగ్లేయుల సంస్కృతి సభ్యతల ప్రభావముద్ర అంతకుముందు భారతదేశానికి వచ్చిన తురుష్కుల తదితర జాతుల సంస్కృతి సభ్యతల ప్రభావముద్ర హిందూజాతియొక్క సంస్కృతి సభ్యతలపై స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నవి సంస్కృతి సభ్యతాప్రభావంతోపాటు భాషాప్రభావంకూడా పడుతుంది ఒక భాష తన శబ్దజాలాన్ని కొంత మరొకభాష కివ్వడం ఆ భాషనుండి కొన్ని శబ్దాలను స్వీకరించడం జరుగుతుంది అరబ్బీ పారశీకము ఫ్రెంచి ఆంగ్లము మొదలయిన విదేశీయ భాషలలోని పదము లనేకం భారతీయభాష లన్నింటిలోనూ ప్రచారంలో వుండడం మనము ప్రత్యక్షంగా చూస్తూనేవున్నాము

విదేశీయపదాల విషయంలో వేరు రెండు వాదాలు వినిపిస్తున్నాయి విదేశీయ పదాలను నిస్సంకోచంగా కలుపుకోవలెనని ఒకటి అన్యభాషలలోని పదాలన్నింటిని బహిష్కరించి భాషను స్వచ్ఛందంగా వుంచవలెనని ఒకటి ఈ రెండు వాదాలలో మొదటిదే అవలంబనీయం రెండవది అంగీకార్యం కాజాలదు ఎందుకంటే కార్డ్లో గార్బో అన్యభాషాప్రభావం పడకుండా ఏ భాష గాడా ఉండలేదు ప్రపంచంలో స్వచ్ఛందమయిన భాషయే లేదని చెప్పవచ్చును

ఏ భాష అయినా యితర భాషలతో సంబంధంలేదని మడి గట్టుకొని కూర్చుంటే అభివృద్ధికాలేదు అది సజీవభాషాలక్షణం కాదు అవసరమును అవశ్యకతను గుర్తించి అన్యభాషలోని పదాలను తన ప్రకృతికి అనురూపంగా మార్చుకొని స్వీకరించడం సజీవభాషాలక్షణం అప్పుడే భాషాశబ్దభాండారం సమృద్ధమూ విస్తృతమూ అవుతుంది లేకపోతే "గొర్రెతోక బెత్తెడు" అన్నట్లు భాషకూడా విస్తృతయాక సంకుచితమైపోతుంది ఫ్రాన్సులో అన్యభాషలలోని పదాలేవీ చేర్చకూడదని ఒక నియమం వుండేదట అందుచేత ఫ్రెంచిభాషలోని పదముల సంఖ్య పరిమితమైనది. అవసరమైనప్పుడు ఎట్టి సంకోచమూ లేకుండా ఇతర భాషలలోని పదాలను కలుపుకోబట్టే ఇంగ్లీషు అపరిమితమైన పదజాలంతో విలసిల్లుతూ ప్రపంచభాష లన్నింటిలోనూ ప్రథమస్థానాన్ని ఆక్రమించింది

ప్రతిభాషకూ ఒక విశిష్టమయిన ప్రకృతి వుంటుంది ఆ ప్రకృతికి అనుగుణమైన పదాలను మాత్రమే అది జీర్ణించుకోగలుగుతుంది మానవుడు తన శారీరక ప్రకృతికి అనుకూలము లయిన పదార్థాలను మాత్రమే తిని జీర్ణించుకోగలడు అట్లుగాక తన ప్రకృతికి విరుద్ధములైన పదార్థములను భుజించితే అజీర్ణవ్యాధి కలుగుతుంది అలాగే భాషకూడా తన ప్రకృతికి విరుద్ధములైన పదాలను స్వీకరిస్తే దానిరూపం వికృతమవుతుంది అంతేకాదు తన అస్తిత్వాన్నికూడా కోల్పోతుంది భాషాప్రకృతిని గురించి చర్చించే సందర్భంలో అరేబియాలో జరిగిన ఒక సంఘటన జ్ఞప్తికి వచ్చింది ఇరాను దేశీయు డొకడు అరేబియాలోని వివిధ ప్రాంతాలలో పర్యటించి అరబ్బీభాషలో విశేషమయిన పాండిత్యం సంపాదించి అరబ్బీలో ఒక నిఘంటువుకూడా వ్రాశాడు అక్కడనే స్థిరనివాస మేర్పరచుకొని తాను అరబ్బు దేశీయుడనని బొంకి ఒక అరబ్బు స్త్రీని వివాహమాడాడు ఒకనాడు దాసితో 'ఉతిప్ ఫుస్సి రాజ్" అన్నాడు అంటే అరబ్బీలో దీపం ముట్టించు అని అర్థం కాని అది విశుద్ధమైన అరబ్బీప్రయోగం కాదు ఈరానీ భాషాప్రకృతి కలుషితం విశుద్ధమైన అరబ్బీలో తుకుతుల్ ఉస్సిరాజా అని వుండాలి ఆ ప్రయోగాన్నిబట్టి ఆ స్త్రీ తన భర్త అరబ్బీ దేశీయుడు కాడని గ్రహించి వెంటనే విడాకు లిచ్చింది

అవసరమును గుర్తించి విదేశీయ పదములను స్వకీయప్రకృతికి అనురూపముగా మార్పుచేసి స్వీకరించవలెనని చెప్పివున్నాము ఆంగ్లములోని Lantern అను పదమునకు మన భాషాప్రకృతికి అనుకూలమయిన 'లాంతరు' అను రూపము నిచ్చి మనము నిత్యము ఉపయోగిస్తున్నాము దీనికే హిందీవాళ్లు తమ భాషాప్రకృతికి అనుగుణముగా లాలటేన్ అను రూపమునిచ్చి వాడుకొంటున్నారు లాంతరు అనునది తెలుగుపదం కాదని ఎరికించి చూస్తేతప్ప గ్రహించలేము అది యిప్పుడు తెలుగుపదం కాదని యెవరైనా చెప్పగలరా? ఇలాగే 'లాలటేన్' హిందీ పదంకాదని

హిందీ భాషాభావు లేవరయినా అవగలరా? "మర్దాయీ" "తనఖా" అనే మహారాష్ట్రి పదాలను "మర్దానగీ" "తనఖ్వాహ్"గా మార్చి హిందీవాళ్లు యథేచ్ఛగా ఉపయోగించుకొంటున్నారు. ఈ పదాలను జనసామాన్యమేకాక భాషావేత్తలుగూడా నిస్సందేహంగా ఉపయోగిస్తున్నారు. "తనఖా" అనే పదం తెలుగుదేశంలోగూడా కొన్ని చోట్ల ప్రచారంలో ఉన్నది. "గుమాస్తా" అనే పారశీక పదమును "గుదస్తా"గా మార్చుకున్నారు మహారాష్ట్రులు. సంస్కృతంలోని "కుమార" రాజస్థాన్‌లో "కుఁవర్"గా మారింది. అక్కడ "కుఁవర్" అనగా గొప్పవారి కుమారుడు అని అర్థం. వాళ్లు అంతటితో ఆగకుండా రెండవ కుమారునకు "కఁవర్" అని మూడవ వానికి "కఁవర్" అనికూడ క్రొత్త పదాలు సృష్టించుకున్నారు. ఈవిధంగా ఒకే భాషలోని శబ్దాలు విభిన్నభాషలలో విభిన్నరూపాలు పొందడానికి కారణం ఆ శబ్దాలను స్వీకరించిన భాషల ప్రకృతియే.

కొన్ని విదేశీయ పదాలు ఎట్టి మార్పులు లేకుండానే మన భాషలలో స్థిరపడిపోయినవి. టిక్కెటు సినిమా రేడియో, సైన్సు పెన్సిలు మొదలయినవి యీ శ్రేణికి చెందినవి. ఈ ఆంగ్లపదాలు భారతీయభాష లన్నింటిలోను మార్పు చేర్పులు లేకుండానే గ్రహింపబడినవి. భారతీయ భాషలలోనేకాక దాదాపు ప్రపంచంలోని అన్ని భాషలలోను ఈ పదాలు స్వీకరింపబడ్డాయి. విదేశీయము లంతరాదను దురభిమానంతో ఇలాంటి పదాలకు మన మాతృభాషలలో క్రొత్త పదాలను సృష్టింపజూడడం హాస్యాస్పదమేకాదు,


మనోహరమైన పరిమళానికి

31
301
3001
జవ్వాదు వత్తులు
సుగంధస్వర్గం

**S. V. మురుగేశన్ అండ్ బ్రదర్సు**

(సువాసన ద్రవ్యాలు, అగరువత్తుల తయారుచేయువారు)

19, గోవిందప్ప నాయక్ వీధి, మద్రాసు 1

హెడ్ ఆఫీసు : మధుర    బ్రాంచి : బెంగుళూరు


హానికరం కూడాను. ఎందుకంటే సహజంగా ఇమిడిపోయిన ఆ పదాలను పెకలించి అసహజములయిన మాతృపదాలను స్థిరపరచాలంటే అది సాధ్యమైన పనిగాదు. ఆంగ్లపదాలే కాకుండా భారతీయ భాషలలోని కొన్ని పదాలుగూడా ఆంధ్రభాషలో పాతుకుపోయినవి. గుమాస్తా, సిరస్తాదారు సర్కారు బస్తా మొదలయినవి వీనికి ఉదాహరణలు. "బస్తా" అసలు వంగపదం. దానిని హిందీవాళ్లూ మనమూ స్వీకరించాము. "బస్తా"ను ధాన్యంపోసే సంచి అనే అర్థంలో మనము ఉపయోగిస్తున్నాము. కాని హిందీవాళ్లు కాగితముల కట్ట అనే అర్థంలో ప్రయోగిస్తున్నారు. "సువిధా" మొదలయిన వంగపదాలు, "వసూలు" మొదలయిన మహారాష్ట్రి పదాలు యథాతథంగా స్వేచ్ఛగా హిందీవాళ్లు వాడుతున్నారు. "వసూలు" అనే పదం తెలుగులోకూడా ప్రచారంలో ఉన్నది. "Opium" అనే ఫ్రెంచి పదాన్ని ఆంగ్లేయులు ఎట్టి పరివర్తన చేయకుండా గ్రహించారు. ఈ పదం హిందీలోగూడా ఉన్నది. కాని హిందీభాషాప్రకృతికి అనుగుణంగా ఉండేటట్లు "అఫీమ్"గా మార్చబడింది. "అల్లా" "రసూల్" మొదలయిన అరబ్బీ శబ్దాలు అటు పారశీకంలోను, ఇటు హిందీ, ఉర్దూలలోను వాడుకలో ఉన్నవి. అరబ్బీ శబ్దాలేకాకుండా పారశీకంలోని "ఖుదా" "పైగంబర్" మున్నగు పదాలుగూడా ఉర్దూ, హిందీ భాషలలో ప్రయోగింపబడుతున్నాయి.

దేనికయినా మన మాతృభాషలలో తగినపదంలభించనప్పుడు మాత్రమే యితర భాషల నాశ్రయించాలి. సాధ్యమైనంతవరకు స్వదేశీయ భాషలనుండే అవసరమయిన పదములను గ్రహించ సమర్థములయిన విదేశభాషలనుండి శబ్దాలను స్వీకరించడం అవమానకరమయిన పనిగాదు. అయితే ఆ స్వీకరించిన పదాలను మన భాషాప్రకృతికి అనురూపంగా మార్చుకొని వాటి విదేశీయత్వాన్ని రూపుమాపగల శక్తి ఉండాలి. మన భాషల ప్రకృతికి అనురూపంగా ఉన్న విదేశీయ పదాలు మన భాషల శబ్దభాండారమును సమృద్ధమును విస్తృతమునూ చేయుటేగాక మన భాషలకు ఒక సూక్ష్మ సౌకుమార్యమును సౌందర్యమును చేకూర్చుతవి. అయితే చీటికి మాటికి అనవసరంగా ప్రతిదానికి యితర భాషలమీద ఆధారపడడం మన భాషల దారిద్ర్యాన్ని సూచించడమేకాక ప్రతిష్ఠకుకూడా భంగకరం. ఇమిడిపోయిన విదేశీయ పదాలపట్ల దురభిమానం వదలి సహృదయంతో స్వీకరించెదరుగాక అని కోరుచున్నా ;

# సామాన్యుడూ, కర్ణాటక సంగీతమూ

వా సా మూర్తి

నేనీమధ్య ఒక పాటకచ్చేరీకి పోయాను కార్యక్రమం ఒక ప్రసిద్ధగాయకుడిది జనం ఇసుకవేస్తే రాలకుండా ఉన్నారు అయినా ఎలాగో జనం మధ్యనుంచి దారిచేసుకొని వేదికకు దగ్గరగా స్థానం సంపాదించుకోగలిగాను మామూలుగానే గణేశస్తుతితో సభ ప్రారంభమైంది. గణేశస్తుతికి పిమ్మట గాయకుడు ఏదో రాగం ఆలాపించసాగాడు

నాకు కర్ణాటక సంగీతమంటే గాఢాభిమానం ఆ సంగీతంలో అధికభాగం తెలుగులోనే ఉండడం సంకుచితాంధ్రాభిమానమే కారణ మనుకోండి మరి ఇంకొకటి అనుకోండి ఏమయితేనేమి కర్ణాటక సంగీతమంటే నేను చెవికోసుకుంటాను కాని నాకు సంగీత శాస్త్రంలో మాత్రం ఏమాత్రం ప్రవేశంలేదు ఫలానా రాగమేమిటో నాకు తెలియదు అందువల్ల సంగీతం విషయంలో నేనొక సామాన్యుడిని

సామాన్యుడిని కావడంవల్ల గాయకుడు చేస్తున్న రాగాలాపన [illegible] కోపీ ముందు రాబోయే పాట ఛాయయైనా తెలుస్తుందేమో చూశాను ఉఁహుఁ—అదీ తెలియలేదు ఆయన సరిగమలమీద ఎక్కడికో పోతున్నారు ఆయనతోబాటు అంతదూరంపోయేశక్తి నాకులేదు నిస్సహాయంగా కూర్చున్నాను ఆ రాగాలాపన నాకర్థం కాదు ఇక నాకందులో అభిరుచి ఏముంటుంది?—అబ్బా, ఎంతసేపు! పావుగంట అయింది ఇంకానా?

అమ్మ! ఆలాపన అయింది ఆయన మంచినీళ్ళడిగారు ఆయన మంచినీళ్ళు తగడమే తడవుగా ఫిడేలాయన అందుకున్నారు గాయకుడు చేసిన ఆలాపనే తిరిగి ఫిడేలుమీద పలికిస్తున్నట్లున్నారు గాయకుడుకూడా మంచినీళ్ళు తాగి భేష్, భేష్ అంటూ ఫిడేలు వాయిద్యం వింటున్నారు మరొక పదినిమిషాలకు ఆయనకు మామీద దయకలిగింది కాబోలు కీర్తన అందుకున్నారు "జ్ఞాన మొసగ రాదా" అనే త్యాగరాజకృతి అది ప్రాణం లేచివచ్చినట్లయింది నాకు ఉత్సాహంతో వినసాగాను కాని కొద్ది సమయం గడచిందో లేదో (హఠాత్తుగా) గ్రామఫోను రికార్డుమీద పగులున్నచోట ముల్లు నిలిచిపోయి కీసా, కీసా, కీసా అన్నట్లు గాయకుడు "జీవాత్ముడు, పరమాత్ముడు, పదునాలుగు లోకములు" అనే మాటలనే తిరిగి తిరిగి పలకసాగాడు. ఈ మూడు పదాలను మొత్తం ఇరవై ఎనిమిదిసార్లు లెక్కించాను కాని ఆ పునశ్చరణలో ఏమైనా సంగీత ముందా అంటే అదీ కనిపించలేదు గాయకుడు మధ్యమధ్య సరిగమలతోనే ఎక్కువసేపు విహరించసాగారు, కాని చివరకు మళ్లీ "జీవాత్ముడు, పరమాత్ముడు పదునాలుగు లోకములు" దగ్గరకే వచ్చేవారు చాలా సమయం గడచింది ఇంటిదగ్గర మావాళ్లు నా కోసం కనిపెట్టుకొని కూర్చుంటారేమోనని భోజనంచేసిరావడం మంచిదని లేచాను అప్పటికే జనంతో మొదట్లోఉన్న ప్రశాంతత లేదు గుసగుసలూ, రణగొణలూ బయలుదేరాయి లేచిపోవడా లెక్కువయ్యాయి ఈ సంచలనం ఎంతగా ఎక్కువయిందంటే ఆఖరికి గానసభ నిర్వాహకులు ప్రజల నుద్దేశించి ఇలా చెప్పవలసి వచ్చింది "పాడుతున్నది ఫలానా ప్రసిద్ధగాయకులని మీకు చెప్ప నక్కర్లేదు ఇంకా ఏమైనా అనుమానముంటే ప్రోగ్రాం బోర్డుమీద చూడవచ్చు కాబట్టి దయచేసి నిశ్శబ్దంగా ఉండవలసింది." అంటే దీని అర్థం జనం దృష్టిలో ఆ ప్రసిద్ధగాయకుడు ప్రసిద్ధగాయకుడిలా పాడడంలేదనేకదా!

నేను భోజనంచేసి తిరిగివచ్చాను ఆపాటికి ఇంకొకపాట ప్రారంభమై ఉంటుందనుకున్నాను నేను సభలో ప్రవేశించేటప్పటికి మృదంగమూ ఘటమూ పేచీపడి ఉన్నాయి ఆపేచీ ఒకమాదిరిగా తెగేటట్లు లేదు కాని చూడడానికీ కొంతవరకు వినడానికికూడా తమాషాగానే ఉంది ఇరవై నిమిషాలకి రెంటికీ రాజీ కుదిరింది అంతా చప్పట్లు కొట్టారు వెంటనే గాయకుడు "జీవాత్ముడు, పరమాత్ముడు పదునాలుగు లోకములు" అని అందుకున్నారు "హా విధీ!" అన్నంత పర్యంతమయింది నాకు కాని ఏం చేస్తాను? వచ్చినందుకు భరించవలసిందే ననుకొని కూర్చున్నాను మరో ఇరవై నిమిషాలకు పాట పూర్తి అయింది గడియారం చూశాను రాగం ప్రారంభించినప్పటినుంచీ పాట పూర్తిఅయేవరకూ గంటా నలభై నిమిషాలు పట్టింది! తరువాత గాయకుడు అంతగా ప్రసిద్ధి గాంచని, వినసొంపులేని తనికీర్తనలలోకి దిగాడు చేసేదిలేక నేను లేచివచ్చాను

ఇంత ఉపోద్ఘాతం ఎందుకంటే నేడు కర్ణాటక సంగీతానికి సామాన్యుడు ఎందుకు దూరంకావలసివచ్చిందో వివరించడానికే ఈదూరానికి కారణం మన గాయకులు సామాన్యులేమి కోరుతారో, సంగీతవిద్వాంసులేమి కోరుతారో తెలుసుకోకపోవడమే పిడుక్కీ, బియ్యానికీ ఒకేమంత్రమన్నట్లు రెండు వర్గాలవారి ముందు వారు

ఒకేవిధంగా గానం చేస్తున్నారు తమ ప్రజ్ఞా పాండిత్యమూ తమ నైపుణ్యమూ కౌశలమూ చూపడమే వారి ప్రధానలక్ష్యంగా ఉంది ఫలితం ఇరువర్గాలను తృప్తిపరచలేకపోతున్నారు అర్థంకాని దానితో ఆసక్తి ఉండనేరదని మనస్తత్వశాస్త్రం చెపుతుందికదా అటువంటప్పుడు సంగీతశాస్త్రం తెలియని సామాన్యులముందు తదరినాతోం 'లూ "సరిగమలూ ఆధారం చేసుకొని అలా గంటలతరబడి ఆలాపనచేస్తే వారికి ఆసక్తిపోయి విసుగెత్తి శాస్త్రీయసంగీతమంటేనే వారు మైలుమారంలో ఉండే పరిస్థితేర్పడిందంటే ఆశ్చర్యమేముంది? అందుకే వాక్యంలో మోక్షమన్నట్లు ముచ్చటగా మూడు నిముషాలలో తరంవాతరహా వాయిద్యాల సమ్మేళనతో రకరకాల ధ్వనులతో పొంపులతో గిలిగింతలు పెట్టి ఊపించి కదిలించి తేల్చివేసే సినిమా రికార్డుల సంగీతాన్నే సామాన్యులాశ్రయిస్తారు ఆ ఆనందం క్షణికమే అనండి అయినా ఒక అరకప్పు తిగినసిమ్మట కాసేపు హుషారు కలిగినట్లు ఆ రికార్డులు విన్న కొద్దిసేపూ తమ బాధ్యతలు మరచిపోయి ఉల్లాసంగా ఉంటారు సినిమా సంగీతం అర్థంచేసుకుందుకు ప్రయత్నమేమి అవసరంలేదుకదా అదంతట అదే మనల్ని ఆకర్షించి పరిస్తుంది అది కేవలం సామాన్యులకోసమే కాని నేటి కర్ణాటక సంగీతంలో సామాన్యుడికి స్థానమేలేనట్లుంది (సామాన్యుడంటే తక్కువగా చూడనక్కరలేదు సంగీతశాస్త్రంలో విశేషజ్ఞానంలేని మహాపండితుడైనా సంగీతానికి సంబంధించినంతవరకూ సామాన్యుడే) తొలి వాగ్గేయకారులు ఏ లక్ష్యో పరమార్థమో లక్ష్యంగాపెట్టుకొని సంగీతాన్ని సాధనంగా చేసుకొని దానిని ఉత్కృష్టకళగా చేశారు కాని నేటి గాయకుల ధోరణినిబట్టి చూస్తే కళకోసమే కళ అన్నట్లుగా ఉంది కళలో సవ్యతా భావోద్రేకమూ అంతరించిపోయి కౌశలం మాత్రం మిగిలింది అందుకే కర్ణాటక సంగీతం తెలుగునాట సామాన్యుడికి దూరమయిపోయింది

ఒక కావ్య ముందనుకోండి దానిని సామాన్యుడెలా ఆనందిస్తాడు? సాహిత్యం తరచిచూసిన పండితుడెలా సంతరిస్తాడు? మనమూ కావ్యం సామాన్యుల సభలో చదివిచెప్పవలసి వచ్చినప్పుడు ఏపద్ధతి అవలంబిస్తాం? సూక్ష్మమైన సాహిత్యవిషయాలు విడిచిపెట్టి స్థూలమైన విషయాలమీదే కేంద్రీకరిస్తాం పద్యాలలోని చమత్కృతి కన్న అర్థమూ కథాసంవిధానమూ పాత్రచిత్రణ రసపోషణ వీటినే ప్రధానంగా తీసుకుంటాం అదే కావ్యం గురించి పండితుల సభలో మాట్లాడవలసి వచ్చినప్పుడు శబ్దగత అర్థగత చమత్కృతులూ విశేషతలూ తదితర కావ్యలక్షణాలు ఎన్నో చర్చిస్తాము అంతేకాని సామాన్యులముందు పండితులకే తెలిసిన విషయాలు ఏకరువుపెట్టి వారిని హడలుకొడుతామా?



సంగీతం విషయంలోకూడా ఈ సూత్రమే వర్తిస్తుంది గాయకులు సామాన్యుల సభలా విశేషజ్ఞుల సభలా అనే భేదం తెలుసుకోవాలి ఈ భేదం గుర్తించుకొని ఆయా శ్రోతలకు తగినట్లుగా వారికి గ్రాహ్యమయే విషయాల నాధారం చేసుకొని గానం చేయాలి సంగీత విద్వాంసుల సభలో పాటలేకుండా కేవలం రాగమే తీసుకొని గంటలతరబడి ఆలాపన చేయవచ్చు కాని సామాన్యుల సభలో అలా చేయడానికి వీలులేదు అంటే సంగీతాన్ని చౌకబారుగా చేసివేయమని కాదు సామాన్యుడికి ప్రసాదయోగ్యంగా చేయమని మాత్రమే

సామాన్యులకు సంగీతశాస్త్రంలోని సూక్ష్మ విషయాలు తెలియవు వారు చక్కని కృతిని ఇంపైన సంగీతంతో విని దాని భావంలో తన్మయం చెందగోరువారు ఇదే వారికి కావలసినది అందువల్ల పాటనుపక్రమించే ముందు దీర్ఘరాగాలాపనలో శ్రోతల మనస్సు విసిగించకూడదు ఆలాపన చిన్నదిగా ఉండి ముందు పాడబోయే కృతియొక్క ఛాయ తెలుపుతూ ఉండడం మంచిది పిమ్మట పాటనే ప్రధానంగా తీసుకొని భావయుక్తంగా పాడాలి అంటే సరిగమలు ఉండనేకూడదనికాదు మధ్యమధ్య అవి ఉండవలసిందే కాని పాటకన్న అవే ఎక్కువైపోకూడదు చక్కని చరణాలు ఆరోహణ అవరోహణలతో త్రికాలాలలో వివిధరీతుల పాడడంవల్ల సామాన్యశ్రోతలుకూడా ఆనందించగలరు ఈవిధంగా సామాన్యుల సామర్థ్యం దృష్టిలో నుంచుకొని సూక్ష్మవిషయాలు వదిలి భాష భావమూ సంగీతమూ వీటినే ప్రధానంగా పెట్టుకొని గానసభలు చేసిన వారు ప్రజలలో శాస్త్రీయ సంగీతమంటే ఇప్పుడున్న భయం తొలగి అభిరుచి కలిగించగలరు

కర్ణాటక సంగీతాన్ని సామాన్యుడికి దూరం చేయడంలో గాయకుల వికృతచేష్టలకు కూడా కొంతపాలుంది అందుకే నేటి వారిలో చాలామందికి ఆ సంగీతమంటే "తదరినాతోం—తరితోం—తరితోం" అంటూ ముక్కొకమూలకీ, మూతి ఒకమూలకీ పెట్టి తల ఎగురవేయడమే నన్న భావముంది ఈ వికారచేష్టలు సాధకంలో పురుకలలా తగులుతాయి ఒకమారు ఒక గానసభలో గాయకుడు 'నగుమోము గనలేని నాజాలి తెలిసి" అనే త్యాగరాజకృతి పాడుతున్నారు ఆ కృతిలో ఎంత ఆవేదన ఉంది! అది వింటుంటే మన హృదయాలెలా కదిలిపోవాలి! కాని ఆ గాయకుని మొహం కేసి చూస్తే నవ్వు ఆపుకోవడం కష్టమయిందంటే నమ్మండి. అప్పుడు నాకనిపించింది పాట కచేరీలకు మన గాయకులను తెర వెనుక కూర్చోబెట్టి పాడిస్తే బాగుంటుందేమోనని ఈ మూతివిరుపులూ తల ఎగురవేయడాలూ పాటలోని భావానికి విపరీత భావం కలగజేస్తాయి రాగసాధన చేస్తున్నప్పుడు కష్టమైన ధ్వనులు పలికించుకోవడంలో సరే తప్పించుకలేమే. ఈ వికారచేష్టలు లేకుం

కి వ్వే క

సాధించడం తగ్గించి పాటకే ప్రాధాన్యమిచ్చి భావయుక్తంగా పాడినప్పుడు ఈ విమర్శకూడా చేయవలసిన అవశ్యకత ఉండదు. శ్రోతలకు విసుగుపుట్టే పరిస్థితి ఏర్పడదు

మన గాయకుల స్వరకటుత్వం గురించికూడా ఒకమాట చెప్పాలి ఉత్తర హిందూస్తానీ గాయకులెవరు పాడినా మలయ మారుతం మన శరీరాన్ని తాకినట్లు వారి సంగీతం మన చెవులకు మృదువుగా సోకుతుంది అందులో కటుత్వం లేశమైనా కానరాదు వారి కంఠంలోని మాధుర్యం మనల్ని వివశులుగా చేస్తుంది కాని దక్షిణాది గాయకులు పాడితే కొట్టవచ్చినట్లుంటుంది ఒక్కొక్కప్పుడు రంపపుకోతలాగానే ఉంటుంది వారి పాట కారణం మనవారు కంఠసాధన (Voice Culture) పట్ల శ్రద్ధ చూపకపోవడమే ఇది నిజంగా పెద్ద దోషమే ఉత్తరాదివారు తమ గొంతుకలో మృదుత్వమూ మాధుర్యమూ తెచ్చేందుకు కొంతకాలం ప్రత్యేకాభ్యాసాలు చేస్తారట మనవారుకూడా అలా చేయడం మంచిది పాడేవాని గొంతుకలో మృదుత్వం లేకపోతే పాటలోని మాధుర్యం కూడా తగ్గిపోగలదు కాబట్టి మన గాయకులు తమ స్వరం విషయంలో ఎక్కువ శ్రద్ధవహించాలి

పాటల ఎన్నికలోకూడా మన గాయకులు శ్రోతల దృష్టిలో గాక తమ పాండిత్యాన్ని నైపుణ్యాన్ని ప్రకటించేందుకు వీలైన వాటినే తీసుకొంటున్నారు తరచు వారి కార్యక్రమంలో వైవిధ్యం లోపించడంవల్ల కూడా ప్రజల ఆసక్తి సన్నగిల్లడం కూడా జరుగుతోంది త్యాగరాజాది వాగ్గేయకారుల కృతులలో కూడా అన్నీ ఒకేరీతిగా ఉంటాయనుకోవడం పెద్ద పొరపాటు వారి కృతులలో కొన్ని సామాన్యులకుకూడా విశేషానందం కలిగించవచ్చు కొన్ని కేవలం పండితులకే విశేషానందమిచ్చి సామాన్యులకంతగా ఆనందప్రదం కాకపోవచ్చు ఈ విషయంకూడా జాగ్రత్తగా గుర్తుపెట్టుకొని వైవిధ్యముండేటట్లు కూడా చూసుకోవాలి.

పై సూచనలు సామాన్యులకీ కర్ణాటక సంగీతానికీ మధ్య ఉన్న అడ్డుతెరలను తొలగించగలవనే అనుకుంటున్నాను కాని ఈ సూచనలు అమలుపరచబడిన వెంటనే కర్ణాటక సంగీతమంటే తెలుగు ప్రజలలో విశేషాదరణ ఒక్కుమారుగా పెల్లుబికివస్తుందని అనుకోలేం ఆర్థిక సమస్యలవల్లనైతేనేమి రాజకీయపరిస్థితుల వల్లనైతేనేమి ప్రజలలో ఒక విధమైన నిస్పృహ వ్యాపించిఉంది వారు పొట్టకూటికి తాపత్రయంలో మునిగి ఉంటున్నారు కళ సాహిత్యమూ అంటే శ్రద్ధ చూపలేకపోతున్నారు మన సంస్కృతి మన సంప్రదాయం అన్న చైతన్యమే లేదు అధికసంఖ్యాకులకు మంచి కావ్యం కానీ, మంచి నవలకానీ చదివే ఓపిక లేకపోతుంది మన కీనాడు అంతగా చదివితే ఏ రైల్వే సాహిత్యమో, కథల పత్రికలో చదువుతున్నాము అలాగే తేలికగా ఆకర్షించే సినిమా సంగీతంలోనే తృప్తిపడి ఊరుకుంటున్నా రధికసంఖ్యాకులు సినిమా సంగీతాన్ని నేను హేయంగా చూడడంలేదు దానికీ ఒక ప్రత్యేకత ఉంది శాస్త్రీయసంగీతం ప్రశాంతంగా ప్రవహించే గంగానది అయితే కొండలమీదినుంచి దుముకుతూ ఉరుకుతూ మెలితిరుగుతూ వడివడిగా ప్రవహించే చిన్న సెలయేళ్లను గంగానదితో పోల్చలేము కాని వాటిలోనూ ఒక సౌందర్యముంది. ఒక ఆనందముంది అలాగే సినిమా సంగీతంలోకూడా కాని నేడు ప్రజలు సినిమా సంగీతాన్నే ఆశ్రయించి కర్ణాటక సంగీతాన్ని పూర్తిగా విస్మరిస్తున్నారు కేవలం కథల పత్రికలతోనే కాలక్షేపం చేస్తూ ఉత్తమ సాహిత్యం చదవకపోవడం ఎంత చింతించతగినదో అంతే ఇదీను మన ప్రజలకో ఆత్మాభిమానం పెరిగి మనకూ మంచి సంస్కృతి ఉంది. గొప్ప సాహిత్యముంది అమూల్యమైన సంగీతసంపద ఉంది అని వారు తెలుసుకున్ననాడు కర్ణాటక సంగీతమంటే ఆదరణ, అభిమానం అదంతట అదే వస్తుంది కాబట్టి మన ప్రజలలో మన సంస్కృతి వైభవంగురించి విస్తారాను ప్రచారంచేసి, మన సంగీతాన్ని మన ప్రజల దగ్గరకు తీసుకువెళ్లవలసిన కర్తవ్యం మనది ఇంతేకాకుండా మన భావిపౌరుల విషయంకూడా శ్రద్ధవహించాలి అందువల్ల బడులలోనూ కళాశాలలోనూ నెలకొకమారు కనీసం మూడునెలల కొకమారైనా, నేను చెప్పిన సూచనల ప్రకారం గానసభ లేర్పాటుచేసి విద్యార్థులందరూ హాజరయేటట్లు చూడాలి అన్ని పాఠశాలలవారికీ గానసభ లేర్పాటుచేయించగల సమర్థత లేకపోవచ్చు ఈ విషయంలో రేడియోవారు చాలా తోడ్పడవచ్చు ఇప్పటికి చాలా విద్యాలయాలలో రేడియోలున్నాయి. కాబట్టి రేడియోవారు వారానికి ఒకటి రెండు రోజులు బడులు పనిచేసే సమయంలోనే ఒక ముప్పావుగంటసేపు కర్ణాటక సంగీత సంప్రదాయంలోని మంచి కృతులు విద్యార్థుల మనస్తత్వాల కనుకూలంగా ప్రసిద్ధగాయకులచేత పాడించి వినిపింపచేయాలి స్కూళ్ల అధికారులు ఈ కార్యక్రమాలను తమ స్కూలు టైమ్‌టేబిల్‌లో ఒకభాగంగానే యెంచి వాటికీ విద్యార్థులందరూ మామూలు పాఠాలకువలెనే నిర్బంధంగా హాజరయేటట్లు చేయాలి నిర్బంధ మెందుకంటారేమో విద్యార్థులు ఒకటి రెండు సార్లు మాత్రం వింటే వారిలో ఎక్కువ ఆసక్తి కలుగకపోవచ్చు పదేపదే కొన్నిమార్లు వింటే వారా సంగీతానికి అలవాటుపడి దానిలోని ఆనందం గ్రహించగలుగుతారు ఇలాగే ఫాక్టరీ యజమానులుకూడా కార్మికుల తీరికవేళల గానసభ లేర్పాటుచేసికానీ రేడియోద్వారా కానీ కర్ణాటక సంగీతం వినిపింపచేయాలి గ్రామాలలో పంచాయతీలే చిన్న గానసభల నేర్పాటుచేయవచ్చు ఈ విధంగా కర్ణాటక సంగీతం విద్వత్సభలూ ధనికుల ఇండ్లనూ మాత్రమే ఆశ్రయించడం మాని విద్యాలయాలలోకి ఫాక్టరీల వద్దకూ, గ్రామాల చావిడిలలోకి కూడా రావాలి ఇలా జరిగినంతలో కర్ణాటక సంగీతం గౌరవానికి భంగమేమీ వాటిల్లదు మరింత ఇనుమడిస్తుందికాని

విజ్ఞులు నేను చేసిన సూచనలు-సహృదయతతో పరిశీలిస్తారని ఆశిస్తున్నాను, త్వరలోనే మన ఆంధ్రప్రభుత్వ మేర్పడనున్నది తెలుగు ప్రజలు ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక, విద్యారంగాలన్నిటిలోనూ అభివృద్ధి పొందడానికి అవకాశం కలుగనున్నది కాబట్టి మనమిప్పటినుంచే కర్ణాటక సంగీతం విషయంలో కూడా నేను సూచించిన విధంగా కృషిచేస్తే ఆ సంగీతాన్ని సామాన్య ప్రజల దగ్గరకు తీసుకపోయినవార మవుతాము వారు కూడా మన సంగీతంలోని సుధాధారను గ్రోలి ఆ ఆనందంలో మునిగి తేలగలగడంతో ఎట్టి సందేహం లేదు.

# తెలుగు జాతి అమూల్య సంపద : మన గేయకవిత్వం

సో మ సుం ద ర్

ఆదికాలంనుంచీ కూడా తెలుగుజాతికి అమూల్యసంపదగా మన గేయకవిత్వం పరిఢవిల్లుతూ వచ్చింది అట్టి గేయకవిత్వం గురించి ముచ్చటించుకోవాలంటే—ఎంతకాలమయినా చాలదు

గేయమంటే ఏమిటి?—సంగీతసాహిత్యాల మేళవింపుతో పద అర్థమైత్రితో ఏర్పడి, ఒకేభావనలో కేంద్రీకృతమై పాడటానికి అనువైన స్వాత్మక కావ్యమని నిర్వచించుకోవచ్చు ఇదే నిర్వచనంతో గనక మన సాహిత్యంలో గేయకవిత్వ చరిత్రను సమీక్షించాలంటే, ఆంధ్రసమాజపు పుట్టుపూర్వోత్తరాలకే పోవాలి కారణం ఏమంటే మన ప్రాచీన సమాజంలో మానవుల ఆనంద విషాద ఘట్టములన్నింటా లయబద్ధమైన గేయం—నాటి సమాజపు అంతరంగిక విశ్వాసంవలె ప్రాదుర్భవిస్తూనే వచ్చింది కొన్నాళ్ళు వెన్నెల కొన్నాళ్ళు చీకటి హోరున వర్షాకాలం, ఘోరమైన చలికాలం ఆనందంతో హృదయాన్ని ఉర్రూతలూగించే వసంతకాలం క్రూర మృగాలబాధ—వాటిని నిర్జించడంకోసం చేసిన వేట చావు—పుట్టుక ఒక్కటేమిటి ప్రతిసంఘటనా, ప్రతిసన్నివేశమూ, వారి కవితావేశానికి మూలకందాలవుతూ వచ్చాయి నిజానికి యివే ఏ భాషలోనైనా మానవుని కవిగామార్చిన జీవనఘట్టాలు

ఆవిధంగానే సుమారు ఇరువదియైదు వందల సంవత్సరాల చరిత్రగల ఆంధ్రజాతికి కూడా గేయం అతిప్రాచీనమైనదే—అనటానికి ఎట్టి సందేహమూ లేదు నన్నయకు పూర్వం కవిత్వమే లేదని శ్రీ వెంపరాలవారు అంటున్నారు వాదనకోసమైనా వారి సూక్తిని ఆమోదించుదామంటే అది ఘోరమైన అబద్ధమని క్షణ క్షణం మానవచరిత్ర హెచ్చరిస్తూనే వుంది తన మనోభావాల్ని ఎదుటవానితో చెప్పడం ఎప్పుడైతే నేర్చుకుంటాడో అప్పట్నుంచీ మానవునికి కవిత్వం సాక్షాత్కరిస్తూనే ఉంటుంది చరిత్రకందినంత వరకూ ఆంధ్రజాతి నన్నయ్యకి పూర్వం 1200 సంవత్సరాలనుంచీ జీవిస్తూనే వుంది అట్టి సజీవమైన సమాజానికి తెలుగు కవిత్వమే లేదనడం కేవలం అన్యాయమే అయితే మన దురదృష్టవశాత్తూ నన్నయకు పూర్వముండిన కవితారీతులు కాలగర్భంలో కలిసి నేటికి మృగ్యమైనాయి నన్నయభట్టారకుడు దేశికవిత్వమును తిరస్కరించి మార్గకవిత్వాన్ని స్వీకరించి, సంస్కృతరీతులలో మహాభారతాన్ని ఆంధ్రీకరించాడు అయితే నన్నయ తర్వాతవచ్చిన మార్గకవులు ముఖ్యంగా పదసాహిత్యాన్ని ఎంత "చంకముంత" పాపిత్యమని నిందిస్తూవచ్చినా—అది ప్రజాదరణపొందిన విశేష రూపంగా పెంపొందుతూనే వచ్చింది శ్రీనాథు వంటి మహాకవి ప్రజాకవితా రూపాలైన గేయఫణితులను స్వీకరించి పోషించాడు శైవమత ప్రాబల్యంలోనూ జైన బౌద్ధమతాలకు ఆలంబనగానూ ఎంతో గేయకవిత్వం పుట్టియుంటుంది

మన పదసాహిత్యానికి గేయకవితకు అవినాభావ సంబంధముంది తెలుగుజాతి ఉద్భావన విశ్వాసాలను, కష్టసుఖాలను, అన్నితరాలలోనూ, అన్నియుగాలలోనూ కూడా జీవం ఉట్టిపడేటట్లు ప్రతిబింబించగల్గింది అట్టి మన పదసాహిత్యం అతి ప్రాచీనదశనుంచి నేటివరకూ ఎంతో లక్ష్యం కావలసియున్నది

తొలుతటి వాగ్గేయకారుడుగా గేయకవితా పితామహుడుగా పేరొందినవాడు తాళ్ళపాక అన్నమాచార్యుడు ఇతని వేలాది కృతులు తిరుపతి దేవస్థానంలో విశేషితాలైన రాగిరేకులపైన లిఖింపబడటమే కాకుండా ప్రజల నాలుకలపైన వర్ధిల్లటంవల్ల కూడా అమృతాలైనయ్ అంతేకాక వద్మాలుగన శాల్మమందలి విద్యానగర సంస్థానాధీశుల ఘనగౌరవ సమ్మానాలు జరపటంవల్ల వీరి కృతులకు ప్రజలలో గల విశేషమైన పలుకుబడి యినుమడించింది "జో అచ్యుతానంద జోజో ముకుందా" వంటి సరళమైన లాలిపాటలనుంచి అతిక్లిష్టార్థంతో కూడిన అద్వైత పరమైన గేయాల వరకూ వీరి కృతులు వేలాదిగా వ్యాపించి ఉన్నాయి అందులో కొన్ని వంశానుగతంగా తెలుగు ఆడపడుచుల నాలుకలపై నాట్యమాడుతూనే ఉన్నాయి వీరి కవితాలాలిత్యాన్ని భావసారళ్యాన్ని తెలిపే యీక్రింది గేయాన్ని చూడండి

"కొలనిదోపరికి గొబ్బిళ్లో యదు
కులస్వామికిని గొబ్బిళ్లో ॥
కొండ గొడుగుగా గోవులగాచిన
కొండుకశిశువుకు గొబ్బిళ్లో ॥
దుండగంపు దైత్యులకెల్లను తల
గుండుగండనికి గొబ్బిళ్లో ॥
[illegible] శిశుపాలుని తిట్టుల
కోపగానికిని గొబ్బిళ్లో ॥
ఏపున గంసుని నిడుమంటెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో ॥
దండివైరులను దరమిన దనుజుల

గుండెదిగులాయెను గొల్లిల్లో ॥
వెండిపైడియగు వెంకటగిరిపై
కొండలయ్యకును గొల్లిల్లో ॥ గొల్ల॥"

ఇలాంటివి నీరిమంచి ఉదాహరణలు చూపాలంటే వేలకొలది ఉల్లేఖించవలసి ఉంటుంది.

అన్నమాచార్యులు నిర్మించిన గేయకవితా సాంప్రదాయాన్ని అనుసరించి తరువాత గేయకవులు ముఖ్యంగా క్షేత్రయ్య అనేక పదాలు రచించారు మువ్వగోపాలనామాంకితంగా రచించబడ్డ క్షేత్రయ్య కృతులలో అంగి, శృంగారం ఈయన శ్రేష్ఠమైన బ్రాహ్మణ కులంలో పుట్టినప్పటికీ సాంఘిక మూఢాచారాలను తృణీకరించి ఒక దేవదాసిని తన ప్రేయసిగా, సహచారిణిగా, స్వీకరించి, తన జీవితకాలమంతా గడిపిన సంస్కర్త కవులు సాంఘికాచారాలకు ఎదురు తిరిగి బ్రతకడం క్రొత్తగాదు చండీదాసు అనే వంగ వైష్ణవకవి "రామి" అనే చాకలి పడుచుతో తన జీవితాంతం గడిపాడు ఈవిధంగానే కులకట్టుబాట్లను అతిక్రమించిన క్షేత్రయ్య తన భగవానువివహితం శృంగార రసోపాసిగా స్వీకరించి తన కవితాలోకంలో జీవిస్తూ వేలాదికృతులలో తన మనోనాయకుని కీర్తిస్తూ అమరుడయ్యాడు ఇవి జావళీలుగా మన దేశపు నాట్యకత్తెల వృత్తికి వన్నెతెస్తూ వచ్చాయి. క్షేత్రయ్య కవితావేశం ఉదాత్తమైనంది ఒకగీతం ఉదహరిస్తాను ఇందులోని విషయం—ప్రియుడు ప్రియురాలిమంచి సెలవుతీసుకొని వేరొకచోటికి వెళ్తూన్నప్పటి సన్నివేశం అప్పుడామె అతనికి వీడ్కోలిస్తూ తన ముగ్ధప్రణయాన్ని యీవిధంగా వ్యక్తంచేస్తుంది—

"అట్టె యుండేవు మమి॥ నా ప్రాణనాథ॥
అట్టె అందుండ కిందువచ్చేదవని
యానవెట్టితిని మమి॥ నా ప్రాణనాథ॥
యింతలో నీవీడకు రాకుంటె
కన్నీరు కావేరికాలువ మమి॥
యింతింత నీ కెమ్మోవికేసె లావకుంటే
యిదిగో నోరెండేను మమి - నా ప్రాణనాథ॥
వినరా నీవు కౌగిలీకుంటె
వున్నమవెన్నెల వేడిమమి॥
వనజాక్ష నీవీడకు వచ్చేదాకా
తలవాకిలి యిల్లామమీ ప్రాణనాథ॥
మరచి ఎన్నెతలోనైనా
మాటలాడేవు గనుక—
మనసు విడిచెదరు మమి॥
కరణ మువ్వగోపాల॥ ఈరేయిగూడ
నాగుసేయకనె రమ్మి నా ప్రాణనాథ॥"

ఇందులో ఎన్నిప్రబంధాల విరహావర్ణనలు తేలికగా సాధించబడ్డవో చూడండి క్షేత్రయ్య పదాలలో సహజ సౌకుమార్యము, సజీవమైన తెనుగుదనము—అనమానములు సనాటి నాట్యకత్తెలు తోడిరాగంలో పాడుతూండగా ఎందరో వినేవుంటారు ఈ పదం చూడండి—

"ఇన్నాళ్ళవలె కాదమ్మా మువ్వగోపాలుడు
ఎన్నో నేర్చినాడమ్మా
నన్ను కన్నులమూసి—
నాచెంతనుండిన
సన్నుతాంగి పోని చాల దన్పరించెనే॥
చలువచప్పరములో పవలు నేనుండగా
బలిమి నాదుకొంగు బట్టిక చాటుగ
పలుమారు చనుమోవల గిలిగింతలిడగాను
తెలిసి నేనడిగితే కిలకిలా నవ్వెనే
వదలక మువ్వగోపాలుడు నమగూడి
మదిరాక్షిరో॥ చానిమమత తెచ్చుకొనెనే
కొదమగుబ్బలపైన కోకలు తొలగించ
కదిసి నేనడిగితే తుద నమ్మగూడెనే
యిన్నాళ్లవలె కాదమ్మా మువ్వగోపాలుడు
ఎన్నో నేర్చినాడమ్మా॥"

మన వాగ్గేయకారుల (Composers) లో మూడవవారు త్యాగరాజు. ఈయన సెమతటి యిద్దరివలెకాక భక్తినే ఒకరసంగా స్వీకరించాడు మన లాక్షణికులు భక్తి ఒకరసమని ఒప్పుకోలేదు కాని భక్తికి శృంగారానికి చాలా దగ్గరిసంబంధమున్నది శృంగారమే—లౌకికస్థితిని విడిచి కొంచెం పైకెగిరి అలౌకిక ఆధ్యాత్మికతను పొందితే భక్తిగా మారుతుంది సుప్రసిద్ధపాశ్చాత్య వాగ్గేయకారులైన బెథోవెన్ ప్రభృతులవలెనే మన త్యాగరాజు కవితలోకూడ మనోహరభావనా నైపుణ్యమూ రసవత్తర సంగీతజ్ఞత గోచరమవుతాయి. దురదృష్టవశాత్తూ త్యాగరాజు ఆంధ్రుడేనని తమిళులు తెలిపే పర్యంతం మనం గుర్తించనేలేకపోయాం ఇతని భక్తిరసం శృంగారానికి ఎంత సన్నిహితంగా ప్రవహిస్తుందో చూడండి—

"చేతులార శృంగారముచేసి
చూతునో శ్రీరామ
పోముగా పరిమళగంధంబుపూసి
వాణి—మురటిచే వినరగనాసి
నాసియుసదు త్యాగరాజునుత అన్నిరోసి
చేతులార శృంగారముచేసి
చూతునో శ్రీరామ"

మహోద్రేకంతో శ్రీరాముని కీర్తించిన ఈయన భక్తిగీతాలు వేలాదిగా వున్నాయి ఇందులో ఏది అనుత్తమమో చూపటమే కష్టమేమో

ఇప్పటివరకు కేవల వాగ్గేయకారులనే ప్రస్తావించాను ఇంతటితోనే గేయకవిత్వం సంపూర్ణంకాదు

మధ్యయుగాల నాటినుండి ఎన్నెన్నో "పదాలు" అనబడే కథనగేయాలు ఉద్భవిస్తూనే వున్నాయి ఇందులో—బాలనాగమ్మ కథ ధర్మాంగద గంగావివాహము కుశలాయకము కాంభోజ రాజుకథ లంకాయాగము కుశలవుల యుద్ధము పెదబొబ్బిలిరాజు కథ కామమ్మ కథ వంటివి ప్రముఖమైనవి కాని ఆయా మహాకావ్యాలలో కొన్నింటిని రచించిన దెవరో మాత్రం నేటికీ అజ్ఞాతంగానే వుండిపోయింది యింతేగాక నన్నయ్యాకు పూర్వంనుంచి నేటి వరకూ సాహిత్య విశేషసంపదలైన ఫ్రీల పాటలు ఏల పాటలు తుమ్మెద పదాలు ప్రభాత పదాలు ఆనంద పదాలు వివాహ పదాలు గొబ్బి పదాలు వెన్నెల పదాలు మొదలైనవి కాలపు కర్కశ హస్తాలలో పడి నలిగిపోతున్నా కొనఊపిరితో ప్రజాహృదయాలలో నిలిచే ఉన్నాయి యిలాంటి రూపాలన్నిటినీ సమగ్రంగా సంపాదించి కూలంకషంగా పరిశోధించి పరిరక్షించుకొన్నప్పుడే తెలుగు జాతీయజీవితం సంపూర్ణసుందర మౌతుంది ఇలాంటి మహాకార్యానికి ఆంధ్ర విశ్వ విద్యాలయంవంటి సంస్థలు పూనుకోవాలి

కాని మనజాతి దురదృష్టవశాత్తు వజీవవిద్యకు మరణశాసనం లిఖిస్తూన్న మన విశ్వ విద్యాలయం వారిందుకు పూనుకుంటారనే ఆశ కనిపించదు

లంకాయాగంలో సీత హనుమంతునితో అంటుంది—

దివదివగండాలు దెయ్యాలతో పోను
హనుమన్న చెప్పుమన్నా
రాముశ్నే బాసి నే ఎడరానవప్పలు
ఎతిరి నసురులచేతను
చెప్పరాదోయన్న చెల్లెలాయంచేను
చెనమాటలు పుట్టును ''

ఇలాంటి హృదయం కరిగించే ఉక్తి వైచిత్రులు మన పదసాహిత్యమంతటా కొల్లలుగా పంతరించబడి ఉన్నాయి

పేరాక భిక్షుకగీతంలో సీత లవునితో అన్నమాటలు—

అటుకొండ యిటుకొండ ఆ రెంటినడుమ
నిమగంటి నాకొడుక ఏటువటు తండ్రి
చెల్లె చుట్టాల్ మనకు రాళ్లే బంధువులు—
ఏరి స్తై విన్నెవ్వ రెత్తుకుంటారు !''

అన్న పైగేయంలో తమ నిస్సహాయతను వ్యక్తంచేస్తున్న సీత మాటలు సంపూర్ణ మానవత్వాన్ని అందుకుంటున్నాయి లక్ష్మణ మూర్ఛలో రాముడు లక్ష్మణునితో యిలా అంటాడు—

దీపమ్ములేపల్లు ఎట్టి దటుపోలు—
ఉదకమ్ములేని కలశ మెట్టి దటుపోలు—
ఎతిలేని ఎతి బతుకు ఎట్టి దటుపోలు —
తమ్ముడా మవులేని నత యట్టుపోలు !"

ఈవిధమైన రసమయఘట్టాలను మన పదసాహిత్యంనుండి ఎన్నైనా చూపవచ్చు వెంకయ్య చంద్రమ్మ అనే వెన్నెలపదంలో నాయిక ఉత్కంఠ ఎలా ద్యోతకమౌతుందో చూడండి —

"తెలివెందమామలో తీయపానకమేండి
తెచ్చిపెడుదువుగాని రారో వెంకయ్య
తెచ్చిపెడుదువుగాని రారా''

మన హృదయాలను ఒక్కసారిగా వెన్నెల్లో ఓలలాడించి హాయి గొల్పుతాయి నిజానికి తెలివెందమామలో తియ్యని పానకంలేదు ఆ వెంకయ్యమామ వస్తే తనలోనే తీయపానక మూరుతుంది

రసమయమయిన మన గేయకవితాసాంప్రదాయాన్ని తీర్చి దిద్దగల జానపదాలు మన జాతీజీవితంనుంచి వేలకొద్దీ జనించాయి మన సాహిత్యానికి శోభనూ లవదగిన ఎన్నో పల్లె పాటలు కాలగర్భంలో కలిసిపోతున్నాయి

మహాకావ్యాల ఔన్నత్యాన్ని రసౌచిత్యాన్ని అందుకోగలిగిన వెన్నెన్నో కవితాచిత్రాలు జానపద సాహిత్యంలో కొల్లలుగా లభిస్తాయి ఈ కావ్యాల రచయితలు సర్వసాధారణంగా అజ్ఞాతులే ఒక్కొక్కసందర్భంలో ప్రజాసమూహమే వీటిని రచించిందా అని పిస్తుందికూడా ఉదాహరణకి

చల్ మోహనరంగా నీకు నాకు జోడుకుదిరెను గదరా
నీకూ నీవారు లేరు నాకూ నావారు లేరు
మల్లెపూలా తెప్పగట్టి తెప్పమీద తేలిపోదము ఎదరా
కంటికి కాటుకెట్టి కడవా చంకానపెట్టి
కంటిపోరే కడవచింపితి గదరా
చల్ మోహనరంగా ''

ఈ కావ్యంలో కవి ప్రతిపాదించిన మహత్తర విప్రలంభశృంగారం ఎంత రసాత్మకమైనది కాని విచారించవలసిందేమంటే ఈ కవి ఊరూ పేరూమాత్రం మనకు తెలియదు

నేను ప్రజలనుంచి నేరుగా సేకరించిన జానపదాలను కొన్నిటిని రుచిచూపిస్తాను ఇందులో ఉత్తమ కవితాలక్షణాలతో పాటు సమాజవాస్తవికతనుంచి సేకరించుకున్న గుణపాఠా లెన్నో సందేశించబడతాయి బహిర్ముఖమైన సమాజజీవితాన్ని పైపైనించి మాత్రమే చూడగల ద్రష్టకు ఏవిధమైన చీకుచింతలూ కనిపించవు కాని సమాజంలో ఒకడుగా బ్రతుకుతూన్న కవికి బాధలుబందీలన్నీ పలకరిస్తాయి అప్పు డత నిలా అనుకుంటాడు

ఉప్పుడుబియ్యం ఎప్పటికాయా
బుల్లోడా వప్పటికాయా
ఉంచుకొన్న ముండ నిత్యమౌతాదా
బుల్లోడా నిత్యమౌతాదా''

[illegible]

అన్న కవిసందేశం ఎంతటి జీవితసత్యాన్ని ఎంతటి అనుభవపూర్వకమైన సందేశాన్ని జాతి కందిస్తున్నదో చూడండి ఇలాంటిదే ప్రవరంగా చెప్పనది మరొక గీతముంది

"తాడిచెట్టుపైన పిడతకే - పిడ
తగులుతున్నవాడు మగడటే''

మానవుని శ్రమశక్తికన్న గౌరవప్రదమైనది లేదు గౌరవప్రదమైన శ్రామికజీవనంకన్న వాంఛనీయమూ మరొకటి లేదు అయితే ఏకశ్రమకు తగిన ఫలితమున్నప్పుడు అంతకన్నా ఆనందకరమైనది లేదు ఏ జాతైనా పురోగతినందుతున్నదీ అంటే సృజనాత్మకశ్రమశక్తికి తగిన గౌరవప్రపత్తులు లభించడంవల్లనే కాని దురదృష్టవశాత్తూ కాలానుగతంగా శ్రమశక్తి కేవల వ్యాపారపు ముడిపదార్థంగా మారిపోవడంవల్ల దుఃఖభాజనమే అవుతున్నది అందుచేతనే సమూహంగా శ్రమైకజీవనం గడిపే మానవులు తమ జీవితదుస్స్వప్నాలను ఏమరచి శ్రమలోని కష్టాన్ని సులభప్రాయం చేసుకుందుకు ఎన్నో రకరకాల గీతాలను సృష్టించుకున్నారు దుంగలు మోసేవాళ్లుగాని కొండలనుంచి పాషాణాలు త్రవ్వేవాళ్లుగాని, రాళ్లను కొట్టేవాళ్లుగాని రోలరు లాగుతూ రోడ్లు పోసేవాళ్లుగాని, పడవమోపులు లాగేవాళ్లుగాని —సృష్టించుకొన్న పాటలలో తమజీవితంపై గల రోతను వ్యంగ్యంగా అపహాస్యం చేసుకుంటూ ఆనందాన్ని పొందడం విచిత్రంగా కన్పిస్తుంది ముఖ్యంగా ఈ గీతాన్ని చూడండి శ్రామికజీవితంలోని కష్టనష్టాల్ని ఈతిబాధల్ని చూపుతూ హాస్యాన్ని జోడించుకుంటుంది

"హైలాసో - హవ్వారి హవ్వా
లాగరోరి - లంగారుజారూ
పీకరోరి పిల్లాడిజాత్తూ
జంపైతే జోకులంగరి
లాగరోరి లంగారుజారూ—
మూడువెల్లా మూండాలబోరూ
అరువెల్లా జన్మకైదు—
ఎక్కూరాపీ పడవామీదా
చెప్పరాపీ దుక్కూమొచ్చే
హైలాసో - హవ్వారి హవ్వా''

ఈ గీతంలోని మూడు నెలల అన్నదోం బ్రోతల్ అర్డుకు సంబంధించిన వివరమేదో అస్పష్టంగా కన్పిస్తుంది ఏమైనా వాళ్ల జీవితమే జన్మఖైదు—పోతే ఎక్కూరాని పడవమీద చెప్పరాని దుఃఖం ఎలావచ్చిందోమాత్రం మనం ఊహించుకోవలసిందే ఇంతకీ పీకరోరి పిల్లాడిజాత్తు అంటాదేమిటి చెప్పా?

మరోపాట చూపిస్తాను అయితే ఈ పాట వెనుకనున్న జీవిత చిత్రమేమిటోమాత్రం నా కందలేదు ప్రతిఒక్కళ్లూ ఆలోచించవలసివుంది

"చేతిమున్న గాజులకోడా
చేతిమున్న గాజులకోడా
ఈయమని కావచ్చేనమ్మా
ఈయమని కావచ్చేనమ్మా
ఉచ్చి తెల్లవారి చూడాలోకే
అడవిలో రుద్రాక్షలాయెనటమ్మా
రాతిరొచ్చిన పొంబికవురూ
ఎంతకైనా మాయలవాడూ''

ఈ గీతం బహుశా శివలీలామహాత్మ్యాన్ని గురించి శైవమతప్రభావంలో మన సమాజ మున్నపుడు ఏ గ్రామీణకవో రచించిన దనుకుంటాను

మన సమాజంలో ఎప్పుడో అజ్ఞానదశలో అన్యాయంగా ఏర్పడిన కులాలు నిత్యజీవితంలో తమ నిరర్థకతను చాటుకొంటూనే ఉన్నాయి మనిషికీ మనిషికీ మధ్యనున్న పరస్పర సంబంధాలు మానవసహజంగా ఏర్పడ్డ సమిష్టిజీవన పద్ధతులు వర్ణవ్యవస్థ కేవలమూ కృతకమని వాస్తవంలో రుజువుచేస్తూనే ఉన్నాయి ఎన్నో శతాబ్దాలక్రిందటనుంచికూడా వాస్తవజీవితంలో వర్ణవ్యవస్థ ఇంతో అంతో దెబ్బతింటూనేవచ్చింది, ఎప్పుడు రాయబడ్డదో ఏ పరిస్థితిలో రాయబడ్డదో తెలియని ఈ క్రింది గీతికాశకలం మన వర్ణవ్యవస్థను నిలబెట్టి ప్రశ్నిస్తున్నది చూడండి:

"అప్పన్నాటంకుటెల్లా - రంగ ఒంకిల్లాడి
అప్పాచెల్లెళ్ల కూడి - పుల్లంకెల్లేకాడ
తోటలోన బాపనయ్య మాటలు కలిపాడ ?
మాటలు కలిపాడా చేతులు కలిపాడా
అప్పన్నాటంకుటెల్లా !''

మన గ్రామీణజీవితంలో వ్యవసాయం ఎంతో సందడి గలది ముఖ్యంగా మందితో జరిగే ఊడ్పులు (నాట్లు) కోతలు కుప్పవేతలు వంటివి ఎంతో మనోహరమైనవి ఈ సందర్భాలలో రైతుకూలీలు ప్రభు-దాస సంబంధాలు విడిచి ఎంతో అన్యోన్యంగా ఉండేవారు ఆ సందర్భాన్ని చిత్రిస్తూ ఉద్భవించిన పద మిది —

"ఆకేదయ్యో - దమ్మేదయ్యో
పోయేటి లంజలకి పొద్దేదయ్యో''
"ఆకిదిగోనే - దమ్మిదిగోనే
పోయేటి లంజలకి పొద్దిదిగోనే''

ఇలాంటి అమృతనిష్యందాలైన జానపదాలను ఉదహరించవలసివస్తే ఎన్నిదినాలైనా చాలవు మన జాతిజీవితం సమగ్రసుందరంగా స్పష్టంగా ఇలాంటి పదాలలో కనిపిస్తుంది జానపదాలను ఎంతో కష్టనష్టాలకోర్చి సేకరించినవారిలో శ్రీ నేదునూరి గంగాధరంగారు చిరస్మరణీయులు అయితే మన జాతి అనుభవిస్తున్న

నవికీడువలితంగా నేటికీ వారు సేకరించిన పదాలను గ్రంథస్థం చేసుకోలేకపోయాం వారి శ్రమకు సరియైన ఫలితం ప్రోత్సాహం లభించకపోవడంవల్ల వారాఉద్యమాన్నే విరమించి ఏకగ్రామం లోనూ జీవించవలసివస్తోంది ప్రస్తుతం వారు పాపం ఎక్కడున్నారో ఏం చేస్తున్నారోకూడా తెలియదు అంతేగాక స్వర్గీయ శ్రీ బాపిరాజుగారుకూడ ఎన్నో గీతాలను సంపాదించి సంస్కరించి "గోధూళి"గా ప్రచురించారు వారు సంపాదించినదే యీ క్రింది గేయం చూడండి —

"తమ్ముడ ఒకసారిట్లారా
తమ్మి మొగమూ పైకెత్తు
మినుకూ మినుకూ చుక్కలురా
కనుగొంటివ అవి ఎవరంచున్
వాడిపోయిన పూవులవే—
దేవుడు చుక్కలు చేయునురా!"

సాధారణంగా పిల్లలు ఎన్నెన్నో పెర్రి ప్రశ్నలు వేస్తారు అమాయకంగా వాళ్లువేసే ప్రశ్నలకు నిజానికి మనం సంతృప్తికరమైన సమాధానాలివ్వలేకే "పెర్రిప్రశ్న" అని తోసేస్తూఉంటాం ఏమైనా వాళ్లడిగిన ప్రశ్నకు ఏదోఒక సమాధానమిస్తేనేగాని వాళ్లు వదిలి పెట్టరు అందాకనే ఈ పై గీతంలో—"ఏమిటీ చుక్కలు" అని అడిగిన పిల్లడికి—"వాడిపోయిన పువ్వులు" అని సమాధానం చెబుతారు కవి

ముఖ్యంగా మనదేశపు తత్వాలలో ఎంతో ఉత్తమమైనవి ఉన్నాయి తత్వాల తత్వమే వేరు వీటిలో మన్నితమైన హాస్యం శ్లేష అన్యాపదేశము వంటివేగాక తీవ్రమైన తాత్విక జిజ్ఞాసకూడా వ్యక్తమౌతూ ఉంటుంది మన జీవితంలో ఎదురయ్యే అనేక సమస్యలగురించిన తీవ్రజిజ్ఞాస పడుతూవచ్చారు తత్వకవులు కాని జీవితం ఒకపట్టాన తేలేటంత సులభమైనదికాదు ఒక ముష్టిపిల్లవాడు పాడుతూండగా నేను సంపాదించిన గీత మిది —

"నరాకవుని కూర్చుండబెట్టి
తప్పించిన మూడూ చెబుపులంటా!
రెండు ఎండే ఎండవూ
ఒకటి పిండే పిండదూ
ఎండని పిండని చెబుపులకిందికి
వచ్చిరి ముగ్గురు కాపులటా—
ఒకరికి అరకేలేదూ—ఇద్దరి కెడ్లేలేవూ!
అరకా ఎడ్లూ లేని కాపులూ
చేసిరి ఉంచెరు పొలమంటా"

ఈ గీతం ఇంకా ఉంది ఈవిధంగానే ఈ తత్వం ఒక కథలాగ నడుస్తుంది అరకా ఎడ్లులేని రైతులు చేసే వ్యవసాయమేమిటో బోధపడదు. ఈ గీతాలలో మన్నితమైన హాస్యం, జీవితంపై ఈసడింపు వ్యక్తంచేస్తూ అన్యాపదేశంగా ఏవో తత్వార్థాల్ని మానవుడికి నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తూ ఉంటాయి

అనూనసాంప్రదాయం గల గేయం మన సాహిత్యంలో అమూల్యసంపదగా వరిఢవిల్లుతూఉంది పండిత విషక్కుల భాషా భేషజాలతో విసివి వేసారిన తెలుగుహృదయానికి చల్లని గీతాలతో సేదతీర్చే బంగారుకాలం వచ్చింది అందాకనే ఆధునిక ఆంధ్ర సాహిత్యపితరులైన శ్రీ గురజాడ ముత్యాలసరాలతో ఆంధ్రవాణిని అలంకరించారు తెలుగు సాహిత్యంలో గేయానికి పునరుజ్జీవనం కలిగించి గౌరవప్రదమైన స్థానమిచ్చారు దేశిమార్గరీతులుగా నన్నయ నుంచీ విడిపోయిన ఆంధ్రసాహిత్యంలో పామరప్రజలది దేశికవితగాను పండితవర్గాలది పద్యంగాను మారిపోయింది "నాది ప్రజల ఉద్యమం" అంటూ విప్లవశంఖం పూరించిన శ్రీ గురజాడ ప్రజల కష్టార్జితమైన గేయఫణితిని స్వీకరించారు ప్రజాయాసాన్ని పునరుద్ధరించారు 'వారు రచించిన ప్రతిగేయమూ తెలుగుజాతికి కొత్త ఊపిరిని సరఫరా చేయడానికే! ముఖ్యంగా డించు లంగరు అన్న ఈ మహాకవి గేయం యుద్ధాలు మానవజాతికి సంస్కృతికి పరమ శత్రువులని వేనోళ్ల చాటుతూంది చూడండి—

"డించు లంగరు దీర్ఘయుద్ధం
ధర్మపక్షము మొల్లదూసెను
నరుల పీనుగు పెంటపోగుల
నాటి పెంపును శాంతివృక్షము
పాతపంథలు పాతిపెట్టుము
యుద్ధమున కవి ఉనికిపట్టులు
లోకమంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును!
వచ్చెనిదె బంగారుకాలము
వాంఛతెల్లమతీరు మనుజుల
జ్ఞానమున స్వాతంత్ర్యమిచ్చుచు
సంతతము వర్ధిల్లగావుత!"

పై గేయానికి వ్యాఖ్యానం అవసరమే లేదు శ్రీ గురజాడతో పునరుద్ధరింపబడిన గేయం నవ్యసాహిత్యంలో విచిత్ర పరివర్తనలందుకున్నది ముఖ్యంగా శ్రీయుతులు కృష్ణశాస్త్రి, వేదుల, రాయప్రోలు, విశ్వనాథ, నండూరి, బసవరాజు ప్రభృతులు గేయంలో ఎన్నో కొత్త తీరులు తీర్చారు ఆధునిక వాస్తవిక-కవితాయుగంలో శ్రీరంగం శ్రీనివాసరావుమొదలు నావరకు ఎందరో కవులు గేయంలో కొత్త రీతులు ప్రతిష్ఠించడమేగాక స్వభావస్వరూపాలలో అపూర్వతను ఆపాదిస్తున్నారు నేటి జీవితపరిస్థితులను ఇతివృత్తంగా తీసుకొని పాతజానపదాల రీతిలో కావ్యాలు రచించిన వారిలో శ్రీయుతులు నండూరి సుబ్బారావు, కొనకళ్ల వెంకట

రత్నం శ్రీ మంకర సత్యనారాయణ, కాళోజీ నారాయణరావు ప్రభృతులు ముఖ్యులు ముఖ్యంగా తెలంగాణావాసి శ్రీ కాళోజీ గీతాన్ని ఉదహరించి ముగిస్తాను

"హద్దుమీరి అధికారవర్గమూ—
అడిన ఆటలు దాలింకా ।
రాజాపేరిట అరాచకమునకు—
జరిగిన పూజలు దాలింకా ।
పాంపపేరిట పల్లెపల్లెలో—
జరిగిన పాపం దాలింకా ।
విచ్చలవిడిగా ప్రాణమానములు—
పాడిన వేలము దాలింక ।
సీదల సర్వస్వముతో ధనికులు—
చేసిన సేరము దాలింకా ।
నిక్కుచు నీల్గుచు నిరంకుశత్వము
చేసిన నృత్యము దాలింకా ।
కాలము వ్యర్థము చేయగ—కళయని
రాసిన కైతలు దాలింకా ।
కైతచేత మేల్కొల్పకున్న—కా
ళోజీ కాయము దాలింకా ।"

ఇలాంటి వీరి గేయాలు తెలంగాణా పల్లెపల్లెలోనూ ప్రతిధ్వనించా యంటే అతిశయోక్తి ఏముంది ? జాతీయోద్యమానికి ఆంధ్ర దేశంలో ప్రాణంపోసిన స్వర్గీయ శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ గారి "మాకొద్దీ తెల్లదొరతనము" వంటి గేయాలు ప్రతిపల్లెగుండె లోనూ క్రొత్త రక్తాన్ని ప్రవహింపచేయలేదా ? అంచేతనే ఉత్త మాదర్శప్రేరితమైన గేయం ప్రజలకు అకుంఠితమైన ఆయుధంగా ఉపకరిస్తుందనడంలో సందేహంలేదు

—(०)—


వినోద విజ్ఞానాలకు చదవండి !

మీ వర్తక, వ్యాపారాభివృద్ధులకు ప్రకటించండి !

గృహలక్ష్మి

(స్త్రీల [illegible]త్ర మాసపత్రిక)

వ్యవస్థాపకులు డాక్టరు కే ఎన్ కేసరి

అనన్యప్రచారంతో ఆంధ్రదేశమంతట విశేష ఆదరాభిమానములకు పాత్రయయి మహిళాభ్యుదయమునే తన ఆశయముగా తదాశయసిద్ధికి షుమారు 25 సంవత్సరములనుండి నిరంతరము కృషిచేస్తున్నదీ "గృహలక్ష్మి"

ఇందు ఉత్తమకథానికలతోబాటు మహిళాభ్యుదయానికి సంబంధించిన సాంఘిక రాజకీయ, సారస్వత వైజ్ఞానికాది వివిధ సమస్యలకు ప్రాధాన్యమిచ్చే వ్యాసాలనేకములుంటవి

"గృహలక్ష్మి" లో ప్రకటించడమంటే వర్తకవ్యాపారాభివృద్ధులకు గ్యారంటీయన్నమాట ।

సంవత్సర చందా రు 4-8-0, అర్ధసంవత్సర చందా రు 2-8-0, విడిప్రతి ఆరు అణాలు

వివరములకు గృహలక్ష్మి కార్యాలయం, మద్రాసు 14.




(రివ్యూకై రెండు ప్రతులు పంపాలి)

## జైలులోపల

రచయిత శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి సర్వోదయ ప్రెస్ మహాకాళీ స్ట్రీటు సికింద్రాబాదునించి ప్రకాశితము ప్రతుల కోసం రచయితపేర వ్రాస్తే లభిస్తాయి పుస్తకం—46 పేజీలు క్రౌను 1/8 వెల పదణాలు

హైదరాబాదు జైలులోపల విజంగా శిక్ష అనుభవించి అక్కడ జరిగిన కొన్ని అనుభవాలకు వాగ్రూపం యిచ్చిన ఒక విరసరాధి ఖైదీ ఆత్మగతాలే యీ ఆరు కథలున్నూ "పరిగె"— మొదటి కథ ఈ అమాయకుడు—అకారణంగా ఒక విరంకుశపరిపాలనకు బలిగా ఖైదీఅయిన విధాన్ని జాలిగా చిత్రిస్తుంది "మొదటుకు మేతలో"—అందరూ సమానమైన జైలులో కూడా హిందూ ఖైదీలకు—మున్లిం ఖైదీలకు మానసిక విభేదాలు వారి ఆలోచనం వంకరలు చూపించి—"మొదటుకు మేత" వేస్తుంది. ఉరి శిక్ష తీయబోయేవాని పాటలు విని ఉండబట్టలేక కసువు ఎలాగో ఉండి గంటమూసివేసి ఒంటి గదిలో శిక్ష అనుభవించిన ఒక ఖైదీ హృదయాన్ని—"పతితుని హృదయం"లో చిత్రించారు రచయిత జైలులో పరిస్థితులు దుర్భరమై సహించలేక వేరప్పుడుకాని ఒక ఎవాము ఖైదీ పిచ్చివాడయిన సంగతి-ఆలాపగల సంభాషణలో చూపించిన కథ "అవకాశమిస్తే" అన్నది ఓనతనంవల్ల—వేరప్పు గా మారి—మోసమూ కోపకీ బాహాటంగా జరిపించే కపటరాజకీయాలపై ఎదురు తిరిగి జైలులోకి వచ్చిన వర్ణయ్య "భిడి లేక" తానుచేసిన పని మరోకథలో వ్యక్తపరిచారు రాజకీయవాదుల చూచి ఆ జయాలు వివాదాలతో దోపిడీచేసిన దొంగ—ఆఖరి కథలో —మీకంటే మేమేం తక్కువ అంటాడు మొత్తంమీద ఈ యారు కథలు ఇప్పటి ఖైదీల మనస్తత్వాన్ని చక్కగా విశదపరుస్తున్నవి ఇందులో మరొక విశేషం—తెలంగాణాలో వాడు కలోఉన్న కొన్ని ప్రయోగాలు.

"హంస"

## వీరకుంకుమ

క్రౌను సైజు 106 పుటలు వెల ఒక రూపాయి ప్రచురించినది విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ-2

శ్రీ ముంజర సత్యనారాయణగారు రచించిన యీ నాటికల సంపుటిలో వీరకుంకుమ కను విప్పు, భూదేవి రాబందులు అని నాలుగు నాటికలు వున్నవి వీటిలో వీరకుంకుమ దేశభక్తి ప్రేరకంగా వుంది రచన గంభీరంగా వుంది

జె వి ఆర్

## మనస్తత్వాలు

రచన శ్రీ రామ్ షా కళాకేళి ప్రచురణ ఆరు కథల సంపుటి 116 పేజీలు క్రౌను 1/8 వెల రూపాయి ప్రాప్తిస్థానం కళాకేళి సామర్లకోట

ఈ సంపుటంలోని ఆరు కథలూ—పత్రికల్లో ప్రకటన పొందినవే. "ఎర్ర జెండా" అనేది గార్కిన్ కథకు, "శత్రువులు" చెకోవ్ కథకు "అబద్ధం కథ" నికోలయిన్ ఆండ్రీవ్ కథకు, "చిదంబర రహస్యం" రాఫేల్ సెబాటిన్ కథకు అనువరణలు అని రచయిత ముందు చెప్పినప్పటికీ మిగతా రెండు కథలలాగ ఇవికూడా స్వంత కథలలాగే కనిపిస్తాయి

రంగస్థలంమీద ప్రసిద్ధికెక్కిన—"మా భూమి" నాటకం చూచినతర్వాత అందులో పాత్రలలో నడిపించిన స్వంతకథ "ముత్తాలయ్య మరణం" రజాకార్ల దేశముఖుల దౌర్జన్యహింసతో తెలంగాణాలో చేసిన విలయకాండకు శాశ్వత ముద్ర వేసింది. గాంధీజీ పెట్టిన భిక్ష అనే కథలో—మనం రామరాజ్యం అనే పరిపాలనలో అకారణంగా జైలుశిక్ష అనుభవించే ఒక ఆదర్శ యువకుని నిర్బంధశిక్ష హృదయవిదారకంగా వర్ణించారు. మిగతా కథలు—ఇతర భాషాకథలకు అనువరణలు ఆయినా అందులో పాత్రలన్నీ—తెలుగుపాత్రలే వాతావరణం తెలుగు వాతావరణం అందుచేత వాటిలో విదేశసంప్రదాయం కనిపించదు "రామ్ షా"కు భాషమీద కథారచనా విధానంమీద మంచి పట్టుకూడ ఉన్నది కాని చివరకు తన రచనల్లో ప్రచారమే ప్రధానోద్దేశంగా చేయడంలో కథలన్నీ నాటకప్రకారం ప్రేరేపించివేస్తున్నారేమో అనిపిస్తుంది ఈ కథలు చదివిన పాఠకులకి

"హంస"

## మొగ సంసారం

రచయిత : శ్రీ కోదాటి వెంకటేశ్వర రావుగారు బి ఏ, సూర్యాపేట. నల్లగొండ
కే వె ర

జిల్లా, హైద్రాబాద్ సంస్థానంలోని ఒక కుటుంబం, కష్టనిష్ఠూరాలను సూచించే చిన్న నాటిక క్రౌను సైజు 16 పేజీలు వెల నాలుగణాలు వలయువారు రచయితకు వ్రాయవచ్చు

కె వి ఆర్

## మందీ మనిషి

కళాకేళి ప్రచురణ సామర్లకోట 80 పేజీలు వెల : రూపాయి

ఎర్నెస్ట్ టాలర్ జర్మన్ భాషలో 1919 లో వ్రాసిన చిత్రమైన Masse-Mensch అనే నాటకానికి ఇది అనువాదం హృదయంలో కలిగే అభిప్రాయాలకి—భావనలకి సంభాషణలరూపం—సంఘటనలరూపం ఇచ్చి వాస్తవిక పద్ధతిలో ఊహల్ని పరిచయంచేసే ఎక్స్ప్రెషనిష్టిక్ పద్ధతిలో ఈ నాటకరచన సాగింది. సమాజంలో విప్లవం తీసుకొనివచ్చి దానితో సంఘాన్ని అతలాకుతలం చెయ్యాలన్న కమ్యూనిష్టు సిద్ధాంతాన్ని ప్రచారంచేసే నాటిక ఇది ప్రదర్శించిన నేరానికి—రచయిత నిర్బంధశిక్ష అనుభవించాడు ఆ రోజుల్లో అనువాదం చేసిన రచయిత "సోమసుందర్" వజ్రాయుధంవంటి కవితాసంపుటాలు వ్రాసిన కవి, స్వచ్ఛందకవితారచనలో చేయితిరిగినవాడు ఏడు చిత్రాలతోకూడిన యీ విచిత్రనాటకం వ్రాయడంలో అనువాదం అనిపించకుండా బాగానే వ్రాశారు స్టేదిపేటవ్వారుకంటె ఈ సిద్ధాంతాలతో ఏకీభవించే "సామాజికుల" యెదట యీ నాటకం ప్రదర్శిస్తే ఇంకా బాగా రక్తికట్టునేమో. తక్కాగా పలుకగలిగే నటులు కావాలి

ప్రతివాడూ తన బ్రతుకు బ్రతుకుతాడు
ప్రతివాడూ తన చావు చస్తాడు

చెట్లలాగ పూవులలాగ, మానవులూ మసులుతారు
నానటిరాకసమనరించి పెరుగుతారు విరుగుతారు
అని భార్గవ అంటే—అతని ప్రతిపక్షంలో ఉంది
భగవంతుని నిందించే ఖైదీ

భగవంతుని దూషిస్తున్నది నేనా ?
లేక భగవానే వరకాతని దూషిస్తున్నాడా ?

ఈ వ్యామోహం ఈ భయానకం, ఈ దుర్భరశోషం
మానవత్వేతే పేరాశ మనిషితో ఆడిస్తోంది
భగవానుడు—ధర్మం సంరక్షించదని భగవానుసు
అలాగే యుద్ధవాదులకి—శాంతివాదులకి సర్షణ–
నిర్బంధవాదులకూ విప్లవవాదులకూ వాదం ఇవన్నీ చిత్రించబడ్డాయి. రచయిత అన్నట్టు

"జీవితంలో కుహాను వాతావరణం ఏర్పడ్డ సమయంలో అతితొందరగా ఉద్రేకాలు హెచ్చుతాయి ఆ ఉద్రేకాలు మందిదారి తొక్కనివాడు పిచ్చిదనానికి పరిణమించి ఛక్కున నవ్వుతాయి వివేచించనివాడు పశువే వివేచించలేని వాడు మూర్ఖుడు వివేచించడానికి ధైర్యం లేని వాడు బానిస—ఈ నాటికలోని అంతరాత్మ ఈ జీవితకుహాను రోజుల్లో మనకు ప్రసాదిస్తుంది." మంచిమాటలు అయితే—యీ వివేచన మన ప్రగతి రచయితల్లో—విప్లవవాదుల్లో ఎంతమంది చూపుతున్నారు ?

"శాంత"

## మై గరీబ్ హుఁ

క్రౌను సైజు 105 పుటలు వెల ఒక రూపాయి దొరకుచోటు ప్రజాసాహిత్య పరిషత్తు ఏ 7-80 కూర్చిగూడ, హైద్రాబాద్ (దక్కను)

ఉర్దూలోని శ్రీ కవిరాజమూర్తి రచనకు శ్రీ గిడుతూరి సూర్యంగారి తెలుగుసేత

భారతప్రధాని పండిట్ నెహ్రూగారు అంకితమీయబడిన యీ నాటకంలో పేదవాని జీవిత బాధానుభవాలు హృదయం కదిలించివేస్తాయి. కథకుడుగా పేరుపొందిన శ్రీ గిడుతూరి అనువాదం సరళంగా వుంది

కె వి ఆర్

## దారినిపోయే దానయ్య

ప్రచురణ దేశకవితా మండలి రచన "బుచ్చిబాబు" 68 పేజీలు వెల రూపాయి

ఈ పుస్తకంలో—పేరుగల నాటికతోపాటు "తీసిన తెర" "నాలుగు పరిణామం", "రహస్య జీవులు" అనే మరో మూడు నాటిక లున్నవి "దానయ్య" నాటిక—నేషనల్ ఆర్ట్సు థియేటర్సు వారి ప్రదర్శనవల్ల ఆంధ్రదేశంలో అందరికీ పరిచితమయింది ఇందులో ఖాన్‌తీరావుగా వేసిన "శివరామ్" రామయోగిగా వేసిన "పుండరీకాక్షయ్య", దారినిపోయే దానయ్య వేసిన "బాలకృష్ణ" యీ పాత్రలకి జీవంపోశారు ఇంగ్లీషులో రంగస్థలిమీద సుప్రసిద్ధ నాటకంగా ప్రదర్శనలు పొందిన Mr Pinn Passes (by A. A Milne) అనే హాస్యనాటకానికి యిది యించుమించు అనువరణ కాని సంభాషణలు కొన్నిమార్పబడ్డాయి సంభాషణలు చమత్కారంగా నడిపించి పాత్రలచేత సీను ఐహాకాయలు ప్రేలినట్టు మాటలాడించే నేర్పుగల కొద్ది తెలుగు రచయితల్లో "బుచ్చిబాబు" ఒకరు ఈయన సంభాషణల్లో చమత్కారానికి సారస్యానికితోడు చక్కని హాస్యం ఉంటుంది. అందుకే—ఈ నాటిక యిన్నిసార్లు వేసినా స్టేజిమీద రక్తికట్టింది కాని కథాసంవిధానాన్నిమాత్రం—సంభాషణలను అవగాహన చేసుకొన్నంతబాగా ప్రేక్షకులు అర్థంచేసుకొన్నట్టు కనిపించలేదు దానికి కారణం కథలోఉన్న ఇంగ్లీషువాసన కొంత కావచ్చు

"తీసిన తెర" లో రామనాథం ఒంటరిగా ఉండగా అతను "ప్రియూరాలు, దేవదేవుడు, కుక్కపిల్ల" అన్నీ అని ఆరాధించిన "రంగుల" అనే సామాన్యపు పిల్ల వచ్చి అతనితో సరసాలు ఆడుతూఉంటే—అతని భార్య రాధ వస్తుంది రంగుల్ని దాచడానికి ప్రయత్నంచేస్తున్న రామనాథం పని బయటపెట్టడానికి రంగుల తండ్రి నారయ్య వచ్చి తెరతీసి—అతని బ్రతుకు బయటపెడ్తాడు రంగుల్ని పెళ్లిచేసుకుంటానని వెళ్లిపోతాడు తీరా అడిగితే—లేదు పదిరూపాయలు

ఒబ్రహ్మాల్ (బ్రహ్మలతా హేరాయిల్)
చక్కని సువాస గలది శిరోజములను పెంపొందించి మెదడును చల్లగ నుంచును అనేక వనమూలికలు సువాసన ద్రవ్యములు మొదలైన వాటితో తయారుచేయబడినది వ్యాపారవివరాలకై వ్రాయవలెను
డిస్ట్రిబ్యూటర్సు :
ది న్యూ స్టార్ అండ్ కంపెనీ
(నెం. 8 బన్ షెర్ మినన్) తండియార్పేట, మద్రాసు.

ఇస్తామ లో అంటారు రాధ—రంగారితో ఇక్కడ ఉంటు ఇంత అన్నం పెట్తావంటుంది. కాని— రంగులుమాత్రం—"ఉత్తమ యిల్లాలు" కనక "నాన్నా వాళ్లతో మనకి పెళ్ళివాద్దు. పెరాతులా వాద్దు. పోదాం పద. ఇదేం మమమలు? ఇదేం పితి?" అని పోతుంది ఇందులో పాత్రలూ వన్నివేశాలూ, స్వభావవిరుద్ధంగా ఉన్నప్పటికి సంభాషణలు చమత్కారంగా ఉన్నాయి. రంగస్థలిమీద రక్తికట్టే నాటిక. "నాలుగు పరిణామం" కాలాన్నీ పాత్రల్నీ స్థలాల్నీ మించిన వ్యస్నద్యశ్యం—పాత్రలు మాటలాడేదేమీ ఎవరికి బోధపడదు "పెళ్లిస్తా వని అమ్మ అఖ్రూతపర్ లో చెప్పింది రేపు ఏలాను చేరింది. మా నాన్న జెపివా వెళ్లారు ఏనో మొన్నో వస్తారు?" అని ఒక రంటే "అందాకా ఎందుకమ్మా వన్నాయివాళ్ల వట్టుకొని గ్రామెపెల్ పుటికే—పర్చిల్ ఒకటే వప్పు" అని మరొకరు అంటారు

ఆఖరి నాటిక "రహస్య జీవులు"—మరొక జీవాచిత్రం ఇది ప్రదర్శనకంటె రేడియోలో వినడానికి, చదవడానికి బాగుంటుంది దీనిలో పాత్రలు జీవాసీ వ్యక్తాలంహారం, అశ అనే రాతి బొమ్మ పుస్తకాంటిజవా గడియారం రివా ల్వరు బొమ్మ తమాషాగా వ్రాసిన సాంకేతిక నాటిక "కళ", "జీవితపు విలువలు", "అనంతం" వీటికి రూపకల్పనచేసి మాటలాడించ డంలో రచయిత అసాధారణప్రజ్ఞావిశేషాలు ప్రదర్శించారు

"హంస"

## ప్రజారాజ్యం

రచయితలు : ఉభయభాషాప్రవీణ శ్రీ శాస్త్రి వెంకట నరసయ్య శ్రీ ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యంగార్లు క్రౌన్ సైజు 86 పుటలు వెల పదణాలు ప్రచురించినది దేశకవితా మండలి ఘంటసాల

సామ్యవాద సిద్ధాంతాంతో రాజకీయ విజ్ఞానాన్ని అందజేయాలనే కోర్కెతో కార్మికుల కష్టవిషాదాలను కళ్ళకు కట్టినట్లు సూచించే మధుర రచన

కె. వి. ఆర్.

## గీతాసంపుటి

రచయిత పి వి రామనరసయ్య ప్రకాశకులు "నేత" కార్యాలయం, నారాయణగూడ, హైదరాబాదు 20 పేజీల కరపత్రం వెల తెలియదు

"ఇదట పుట్టిన చిగురుకొమ్మైన చేవ" అని తెలంగాణా రచయితలు గర్వపడుతున్నారు తెలంగాణా రచయితల సంఘంతరఫున దాశరథిగారి పరిచయం "దుక్కులు"తో ప్రారంభమై "చేనేత వస్త్రాలు" ప్రకటనతో ఈ పుస్తకం పూర్తిఅవుతుంది. ఈ రచయిత చేనేత పారిశ్రామిక సంఘంలో—సహకారపద్ధతి నేర్పిన సమర్థత గల కార్యదర్శిట! ఈ కావ్యం చదివితే "దాశరథి"కి వివ్రవస్తే—కావ్యం చూచి—మురిపిందిక తెలంగాణా" అన్నారు కవి

ఎంత వేడినమ నీ క్షేమం -
చూడకుండని ప్రజాప్రభుత్వం
సంతిన వినతుల మెహెూరాండముల -
త్రోసిపుచ్చెనోయీ
ఇది ప్రభుత్వతీరోయీ!
అనవ్య మిత మన పూజ్యబాపూజీ -
చూపినట్టి ఈమార్గం
సత్యాగ్రహమే - మనకు శరణ్యం అని
రండోయి రండోయి-నేతశ్రామికులార

అని ఏవో ప్రబుద్ధగీతాలు వ్రాశారు

ఇందులో వ్యాకరణదోషాలు అవీ యెక్కువ అని అంటే తెలుగునకున్న "వ్యాకరణ దీపము దిన్నది" అని "దాశరథి" సమాధానం చెప్పారు మొత్తంమీద భాష మోటుగా ఉంది వివాదాలతో నడుస్తుంది తప్ప కవిత్వం కావ్యభాషా అని చెప్పదగిన రసాత్మకమైన వాక్యం ఒకటీ కనిపించదు ఈ "రక్కు"లో వెలుగూ లేదు వేడి లేదు పాటంపేరున పేర్చిన మాటల వివాదాల మూట అనలు పేరులోనే తప్పు గీతికాసంపుటి అని ఉండాలి, గీతాసంపుటి అన్నారు వీరు

"హంస"

## గ్రంథస్వీకారం

1 భారతీయ తత్త్వశాస్త్రము (ప్రథమభాగము) రచన : డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్ అనువాదం శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం ఏ వెల అయిదు రూపాయలు

2 శ్రీమహర్షి జీవితకథామృతము (నాలుగవ భాగము) రచన శ్రీ బులుసు వేంకటేశ్వరులు ఎం ఏ వెల రెండు రూపాయలు పై రెండు గ్రంథాలు ప్రచురణ గ్రంథకర్త రామారావుపేట కాకినాడ

3 కదంబం (వివిధ రచయితల కథానికలు) కూర్పరులు : శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ బి ఎల్ పరిచయం : శ్రీ పాలగుమ్మి పద్మరాజు ప్రచురణ : నవ్యసాహితీ సమితి, ఏ-18-458 చిక్కడపల్లి, హైదరాబాదు (దక్కను) వెల పన్నెండు అణాలు

4 వివేకానందుడు (పద్యకావ్యం) రచన బాలసరస్వతి శ్రీ ఉండేల మాల కొండారెడ్డి ప్రచురణ జీవదయా పబ్లికేషన్స్ శ్రీ కర్రి అప్పారెడ్డి గొల్లలమామిడాడ (వయా) ద్వారపూడి, తూర్పు గోదావరి జిల్లా వెల రెండు రూపాయలు

5 నా వీణ (గేయాలు) రచన శ్రీ నారపరెడ్డి ప్రచురణ కవికోకిలా పబ్లికేషన్స్, నెల్లూరు వెల అర్ధరూపాయి,

6 పరిణతి రచన : మూర్తిశ్రీ ప్రచురణ విపంచికా ప్రచురణలు శ్రీపతి ముద్రణాలయము కాకినాడ వెల పన్నెండు అణాలు

7 శిశువిద్య (విద్యావిషయిక మాస పత్రిక) సంపాదకులు రావ్‌బహదూర్ ఎం లక్ష్మీనారాయణరావు, ఎం ఏ ఎల్ టి.

కె వెన్నెర

విద్యార్ణవ, సాహిత్య సరస్వతి శ్రీ ఎన్ పేరరాజు ప్రచురణ శ్రీ పి ఎల్ నారాయణ, బి ఏ ఆత్మారాం అండ్ కో ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, అనంతపురం విడిపత్రిక వెల మూడు అణాలు సంవత్సర చందా రూపాయిన్నర

9 ప్రజావాణి (వారపత్రిక) సంపాదకులు శ్రీ వట్టికొండ రంగయ్య ప్రచురణ: 2, టిప్పుసాహిబ్ స్ట్రీట్ మద్రాసు 2 విడిపత్రిక వెల రెండు అణాలు సంవత్సర చందా ఆరు రూపాయలు

9 వెలుగు (వారపత్రిక) సంపాదకులు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య రాజమండ్రి. విడిపత్రిక వెల : మూడు అణాలు.

10 ఆర్థిక సమత (వారపత్రిక) ప్రధాన సంపాదకులు శ్రీ లవణం ప్రచురణ పటమట (వయా) విజయవాడ విడిపత్రిక వెల రెండు అణాలు, సంవత్సర చందా ఆరున్నర రూపాయలు

HINDI

11 నయీ ధారా (మాసపత్రిక) Nayi Dhara, Patna ప్రధాన సంపాదకులు శ్రీరామవృక్ష బేనీపురి ప్రచురణ అశోక ప్రెస్ మహేంద్ర, పాట్నా విడిపత్రిక వెల ఒక రూపాయి సంవత్సర చందా పది రూపాయలు

12 ప్రేరణా (మేఘదూత అంక్) Prerana, Jodhpur సంపాదకులు శ్రీ కోమల్ కోఠారి ప్రచురణ ప్రేరణా ప్రకాశన్, సోజతి గేట్, జోధ్‌పుర్ విడిపత్రిక వెల రూపాయి పావలా సంవత్సర చందా : పదునాలుగు రూపాయలు

13 రాణీ (మాసపత్రిక) Rani, Calcutta. సంపాదకులు శ్రీ దీనానాథ్ శర్మ ప్రచురణ : రాణీ కార్యాలయం. 121, చిత్తరంజన్ ఎవెన్యూ, కలకత్తా విడిపత్రిక వెల ఆరు అణాలు సంవత్సర చందా : నాలుగు రూపాయలు

14 సచిత్ర ఆయుర్వేద్ (పరిషద్ అంక్ ప్రత్యేక సంచిక) Sachitra Ayurved, Calcutta. ప్రధాన సంపాదకులు పండిత రామనారాయణశర్మ ప్రచురణ 166, వారాణసీ ఘోష్ స్ట్రీట్, కలకత్తా విడిపత్రిక వెల ఆరు అణాలు సంవత్సర చందా : నాలుగు రూపాయలు ప్రత్యేక సంచిక వెల రెండు రూపాయలు

15 భోజపురీ (మాసపత్రిక) Bhojapuri, Arrah సంపాదకులు శ్రీరఘువంశ నారాయణ సింహ ప్రచురణ భోజపురీ కార్యాలయం, ఆరా విడిప్రతి వెల ఎనిమిది అణాలు సంవత్సర చందా అయిదు రూపాయలు

16 సంపద (మాసపత్రిక) Sampada, Delhi. సంపాదకులు శ్రీకృష్ణచంద్ర విద్యాలంకార్ ప్రచురణ అశోక్ ప్రకాశన్ మందిర్ రోషనారారోడ్, ఢిల్లీ విడిపత్రిక వెల పన్నెండు అణాలు సంవత్సరచందా ఎనిమిది రూపాయలు

17 కల్యాణ్ (మాసపత్రిక) Kalyan, Gorakhapur సంపాదకులు శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ శ్రీ చిమ్మన్‌లాల్ గోస్వామి, ఎం ఏ ప్రకాశకులు: గీతాప్రెస్, గోరఖ్‌పుర్ విడిసంచిక వెల: ఏడు అణాలు సంవత్సర చందా: ఏడు రూపాయలన్నర

18 ధర్మదూత (మాసపత్రిక) Dharmadut, Benares సంపాదకులు, శ్రీ త్రిపిటకాచార్య భిక్షు ధర్మరక్షిత ప్రచురణ: మహాబోధి సభ, సారనాథ్, బెనారస్. సంవత్సర చందా మూడు రూపాయలు

BENGALI

19 నరనారీ (మాసపత్రిక) Nara-Nari, Calcutta సంపాదకులు శ్రీ సుశాంతకుమార్ హాల్దార్ ప్రచురణ 25/1, కవిభూషణ దే స్ట్రీట్ కలకత్తా 12 విడిప్రతి వెల పది అణాలు సాలుచందా ఏడు రూపాయలన్నర

ENGLISH

20 క్రాస్ రోడ్స్ (వారపత్రిక) Cross Roads, Delhi సంపాదకులు శ్రీ ఏ రామమూర్తి ప్రచురణ 56-64 రోహతక్ రోడ్ న్యూ ఢిల్లీ 5 విడిప్రతి వెల అయిదు అణాలు సాలుచందా పదునాలుగు రూపాయలు

21 ఈస్టరిన్ వరల్డ్ (మాసపత్రిక) Eastern World, London సంపాదకులు మిస్టర్ హెచ్ సి టాస్సిగ్ ప్రచురణ ఈస్టరిన్ వరల్డ్ 45 డార్‌సెట్ స్ట్రీట్, లండన్, డబ్ల్యు 12 విడిపత్రిక వెల; రెండు షిల్లింగులు సాలుచందా ఒక పౌను అయిదు షిల్లింగులు

22 యోగోదా Yogoda, Dakshineswar సంపాదకులు బ్రహ్మచారి శ్రీ ప్రకాశ్ ప్రచురణ యోగోదా సత్సంగ్, యోగోదా మఠ్ దక్షిణేశ్వర్ పోస్టు అరియాదా, 24 పరగణాలు వెస్ట్ బెంగాలు

23 మేల్-మిలాప్ (మాసపత్రిక) Mel-Milap, Bankipur సంపాదకులు శ్రీ హెచ్ బి చంద్ర శ్రీకమల్‌దేవ్ నారాయణ, బి ఏ, బి.ఎల్., శ్రీ ఎ ఎం ఖాన్ సాలుచందా: నాలుగు రూపాయల పావలా

—•••—




[ప్రజాహృదయం శీర్షికలో పాఠకుల ఉత్తరాలు ప్రకటింపబడతవి. నేడు సమాజాన్ని కలవరపెడుతున్న ప్రధానమైన రాజకీయ ఆర్థిక సమస్యలనుగూర్చి గాని, భాష, సాహిత్యం విజ్ఞానం, సంస్కృతి, కళలు, విద్యావిధానం మొదలుగా గల విషయాలనుగూర్చిగాని పాఠకులు జాబులు వ్రాయవచ్చును. సూచనలు సాధ్యమైనంతవరకు నిర్మాణాత్మకంగా ఉండటం మంచిది. రాజకీయాలనుగూర్చి వ్రాయబడు జాబులు పార్టీ రాజకీయాలకు సంబంధించినవి కాక, రాజకీయ సిద్ధాంతాలకు తత్వానికి సంబంధించినవిగా ఉండాలి. ప్రయోజనకరములైన జాబులు మాత్రమే ప్రకటింప బడతవి. పాఠకుల జాబులు కిన్నెరలో ప్రకటితములైన యెడల అట్టివారికి మూడు నెలలవరకు కిన్నెర ఉచితంగా పంపబడుతుంది. సం ]

సంపాదక మహాశయా

"కిన్నెర" ఆంధ్రసాహిత్యానికి అపార సేవ చేస్తుంది.

కాని ఆంధ్రపాఠకులెక్కువగా ఆశించే, ఆదరించే పద్యాలు గేయాలు "కిన్నెర" లో కానరాకుండుట విచారకరం.

ఎక్కువ సాహిత్యాన్ని సృష్టించాలన్నా భాషలోని సత్తువ్వాన్ని చూపించాలన్నా పద్యాలు గేయాలే సాధనాలు.

తెనుగు భాషావికాసం కలిగించే పద్య కవిత్వమింది. అది మాత్రం మరువవద్దని మనవి.

పద్యాలు గేయాలు లేకపోవుట తెలుగు సారస్వతాన్ని పెదజల్లే "కిన్నెర" కీర్తికి కళంకమనుకుంటున్నా.

"కిన్నెర" పద్య గేయ కవితకు తగు స్థానమిచ్చి అభ్యుదయంగా ఇంకా మున్ముందుకు పురోగమిస్తూ ఆంధ్రభాషామతల్లికి పూర్తిసేవ చేయగలుగుతుందని ఆశిస్తున్నా.

గుడివాడ. అప్పమిల్లి పూర్ణచంద్రరావు

మహాశయా!

మీ కిన్నెర బాగా ప్రచురించుచున్నందుకు చాలా సంతోషం.

మా గ్రామంలో మేము చాలావరకు పాఠకులంతము మీ కిన్నెరను ప్రతినెలా చదువుతూ వున్నాము. మనవి.

జూన్ సంచికలో జీవితం విలువ చని పోయి చవిపోలేదని నచ్చచెప్పినది. జూలై సంచికలో మతి శరపరంపర ఆగష్టు సంచికలో ఉలూపి వాటిక స్వప్నములు. అందరికైతవ్యములు అను శీర్షికలతో ప్రచురించిన వ్యాసాలు చాలా బాగా వున్నాయి.

కట్టమూరు గొల్లపూడి వీరభద్రరావు

ఆర్యా

జూలై నెల కిన్నెరలో శ్రీ రమణారెడ్డి గారి "కన్యాశుల్కం" అనే వ్యాసం శ్రీ పి నారాయణరెడ్డిగారి "అభ్యుదయ కావ్యాల్లో అగ్ని" అనేది ఉత్కృష్టతకి చెందిన వ్యాసాలు ఇటువంటి ఉత్తమ వ్యాసాలను ప్రకటిస్తూ, కిన్నెరద్వారా తెలుగు సాహిత్యానికి మీరు చేస్తున్న సేవ ప్రశంసనీయమైనది.

విజయనగరం. వి రామమూర్తి

భారతీయ సంస్కృతి

జావా, బాలీ ద్వీపాలలో భారతీయ సంస్కృతి (ఆగష్టు 58 కిన్నెర) చదివాను పూర్వకాలంలో మన ఆంధ్రులు వర్తక వ్యాపారాలకై దూరదేశాలకు వెళ్లారు. అక్కడ మన నాగరికతను, సంస్కృతిని వ్యాపింప చేశారు. ఆంధ్రుల కళావైభవం జావా, బాలీ మొదలైనచోట్ల నేటికీ నిలిచి ఉన్నది కావున, మనపూర్వులు చేసిన ఘనకార్యాలను గూర్చి తెలిసికోవడం వారి ప్రతిభాసంపత్తిని అవగాహనచేసికోవడం నేటి ఆంధ్రుల ధర్మం కాదా? శ్రీ దేవరాజు కృష్ణశర్మగారు తమ ఉపన్యాసంలో చెప్పినట్లు ఆంధ్రదేశం మంచి సంస్కృతి రాయబారవర్గం వెళ్లడానికి ఏవైనా అవకాశాలు లభించేటట్లు పెద్దలైనవారు ప్రయత్నించాలని నా ప్రార్థన

వరంగల్లు. ఎం. వి. నరసింహం

Printed by V Azizullah at the Deccan Times Press, 137, Broadway, Madras, for the Deccan Printing & Publishing Co Ltd., Madras. Published by P Mira Bai at 18, Jones Street, Madras—1
Editor: P MALLIKARJUNA RAO Assistant Editor: P MIRA BAI.

**VIJAYA'S THREE GEMS**

# ASOKA

**AMLA VEPA BRAHMI**

**VEGETABLE HAIR OILS**








***MEDICATED & DELIGHTFULLY PERFUMED HAIR TONICS***

**VIJAYA CHEMICAL & TOILET WORKS**

"VIJAYA MANSIONS"

15, CLEMENS ROAD, PURASAWALKAM, MADRAS. 7.

విజయా రత్నత్రయము

## అశోకా అమ్లా, వేప, బ్రహ్మి హేరాయిల్సు

అనాదిగా భారతీయులచే పై మూడు (అమ్లా వేప బ్రహ్మి) వృక్షములు పూజింపబడుచున్నవి యేలనగా వీటియందుగల అమూల్యమైన ఓషధీగుణమే కారణము ఈ అమూల్య గుణములను కోరువారు ఈ ఓషధులతో తయారు చేయబడిన పై హేరాయిల్సు ఉపయోగించిన పై గుణములేగాక యింపగు పరిమళమును పొందగలరు శిరోజవ్యాధులు మొ ... ల్లను ... ఉన్నంతలో సాటిలేనివి

విజయా కెమికల్సు,

15 క్లెమెన్సు రోడ్డు పురశవాక్కం

మదరాసు-7



# సౌభాగ్య

గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఒక అంశమైన మహిళాభ్యుదయాన్ని సాధించే ఉద్దేశంతో భారతదేశంలో ఓం ప్రథమంగా మదరాసు ప్రభుత్వం స్త్రీ జనాభ్యుదయశాఖను స్థాపించింది

స్త్రీల విజ్ఞాన వికాసాలకు దోహద మిచ్చే రచనలతో "సౌభాగ్య" అనే సచిత్ర మాసపత్రిక ప్రచురింపబడుతున్నది సాంఘిక సంక్షేమం "సౌభాగ్య" ఆశయం

అందరికీ అందుబాటులో ఉండేటట్లు విడిప్రతి వెల 3 అణాలు సాలు చందా (పోస్టేజీతో సహా) రెండు రూపాయలు ఏర్పాటు చేయబడింది

"సౌభాగ్య" ప్రతులకు స్త్రీ జనాభ్యుదయశాఖను గురించిన ఇతర వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి

ఎడిటర్: "సౌభాగ్య"

**7, అరాముడు గార్డెన్ స్ట్రీట్, ఎగ్మూరు, మద్రాసు—8**




మీకు నమ్మకమైన నీలగిరి తైలం కావాలంటే

ఒంటె మార్కు, కైట్ మార్కు వాడండి అవి కల్తీ లేనివి

ఒంటె మార్కు - కైట్ మార్కు హిందూదేశమంతటా దొరకును

**వేటో కంపెనీ. 16, జోన్స్ స్ట్రీట్, మద్రాసు 1.**